# ఖాదీ అర్థశాస్త్రం

## మహాత్మా గాంధీ

అనువాదం :

కొడాలి ఆంజనేయులు

అహమదాబాద్ నవజీవన్ ట్రస్టువారి అంగీకారము పేరగు

మదరాసు గవర్నమెంటు ముద్రణాలయ

సూపరింటెండెంటు వారివలన

ముద్రింపబడినది

1958

(ఉద్యోగరీత్యా ఉపయోగమాత్రమునకు.)

వెల రూ. 10.

Seshendra Kaavya Bhumika
(YUGAKAVI SESHENDRA VOL. II)


దొరుకుచోటు :-

1. విశాలాంధ్ర బుక్ హౌస్,
విజయవాడ, తదితరశాఖలు

2. నవోదయ పబ్లిషర్స్
ఏలూరురోడ్డు, విజయవాడ

3. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్డు, సికిందరాబాదు

4. సి. యల్. యస్. బుక్‌షాపు
నాంపల్లి స్టేషన్‌రోడ్డు, హైదరాబాదు

వెల : రూ. 7/-

ముద్రణ :
వరలక్ష్మీప్రెస్, ఖైరతాబాదు, హైదరాబాదు.
గాయత్రీప్రెస్, తిలక్‌రోడ్డు, హైదరాబాదు,

Kaavya Bhumika, is an anthology, a sequel to Yuga Kavi Seshendra consisting of collected criticism on Sri Seshendra who has given us three decades of potent literature in the most infectious words.

The triology, Yuga Kavi Seshendra, Seshendra Kaavya Bhumika, and Yuga drashta are the eternal kirti stambha of his genius and vision.

A book of this nature will be tremendously useful for those who are engaged in research at the various universities.

We have documented these articles with a view to preserve all the relevent papers which are apt to get misplaced or destroyed with lapse of time.

— Editorial Committee

## ప్రచురణ కర్తలు

నెల్లూరుజిల్లా రచయితల సంఘము
కర్నూలుజిల్లా రచయితల సంఘం
ఆంధ్రసారస్వతసమితి, మచిలీపట్నం
నవ్యకళావాహిని, నరసరావ్ పేట
నవభారతి, అనంతపూర్
అరుణోదయ, హైదరాబాదు.

# -: వి ష య సూ చి క :-

## మొదటి ప్రకరణము

H. S. వెంకటేశ్వరమూర్తి M. A.
కవి, నవలాకారుడు, కన్నడ లెక్చరర్,
సెయింట్ జోసెఫ్ కామర్సు కళాశాల, బెంగుళూరు.

మూడవ ప్రకరణం

## నాలుగో ప్రకరణం



## ఐదో ప్రకరణం





మొదటి ప్రకరణము

# అడిగ + శేషేంద్రలతో ఒక సాయంకాలం

కన్నడమూలం .

శ్రీ **H. S.** వెంకటేశ్వరమూర్తి M A.,
(కవి, నవలాకారుడు, కన్నడ ఉపన్యాసకుడు
సెయింట్ జోసఫ్ కామర్సు కళాశాల
బెంగుళూరు)

అనువాదం :

డా. తంగిరాల వెంకటసుబ్బారావు

దీపావళికి రెండు రోజులు ముందు నేను శేషేంద్రశర్మ గారిని చూశాను. అది అశోకా హోటలు అయిదో అంతస్తు. కిటికీలోంచి ఆకారాన నగరపు వృక్ష సమూహాలు భవనాల శిరస్సులూ కనిపిస్తున్నాయి. కన్నడ ప్రసిద్ధ కవి గోపాలకృష్ణ అడిగ గారితో వారు గంభీర చర్చలో నిమగ్నులై వున్నారు. శేషేంద్రగారి భార్య రాజకుమారి ఇందిరాదేవి . ధన్‌రాజ్‌గిర్, డా. తంగిరాల, నేను తెలుగు కన్నడ భాషల మహాకవులిద్దరి

సంభాషణ కుతూహాలంతో గమనిస్తున్నాము. అడిగ శేషేంద్రలు భేటీ అవడం అదే మొదలు. తమ సంభాషణలో మొత్తం ప్రపంచపు సాహిత్యసిద్ధిని, జీవితంలో వివిధ అంతస్తులను తమ తమ దృష్టి కోణాల్లో వెలకట్టుకొంటూ ఒకరికొకరు పరిచయ మవుతున్నట్లు కనబడింది.

సుమారు ఏభై యేళ్ళ వయసున్న శేషేంద్ర గారు ఆధునిక తెలుగు సాహిత్యంలోని ముగ్గురు మహాకవుల్లో ఒకరు. పాండిత్యం ప్రతిభ వారిలో చక్కగా సమన్వయం పొందాయి. ప్రారంభంలో వారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి పద్ధతిలో వృత్తకందాదులలో చందోబద్ధమైన కవిత్వాన్ని వ్రాస్తూ సాంప్రదాయిక కవిత్వంలో ఒక ముఖ్య ధ్వనిగా వుండేవారు. ఇటీవల 40 ఏళ్ళ కాలంలో తెలుగులో "కవిత్వం విప్లవ కాహళి కావాలి" అనే నినాదం బయలు దేరింది. ఇది విప్లవ కవుల తిట్లలో, నినాదాలలో. బీభత్స కవితల వేషంలో పరాకాష్ఠ నందుకొన్నది,

నిజమైన కవిత్వం ఏమిటి ? అనే విషయంలో కేవలం తిట్లు నినాదాలు, అనుమానాలు విజృం

భిస్తున్న రోజుల్లో శేషేంద్ర తమ పూర్వమార్గాన్ని వదలి, ఉన్నట్టుండి ఒక ప్రచండ కావ్యధ్వనిగా పునరుద్భవించారు. "నువ్వు దేన్ని గురించి అయినా వ్రాయి, కాని నువ్వు వ్రాసింది కవిత్వంగా మాత్రం వుండాలి కవిత్వం కవిత్వంగా వుండడం కవిత్వంలో కీలకం. అటువంటి కవిత్వం జీవితం యొక్క మూల ద్రవ్యాల శోధనలో అలంకరింప దగినది" అని శేషేంద్ర ఘోషించారు. కవిత్వాన్ని పద్యాల గణిత చెరసాలలోంచి తప్పించి, పద్యం లాగే గద్యాన్ని వ్రాసి, 'కవిత్వం వుండేది ఆకారంలో కాదు ఆత్మలో' అన్నారు.

ఒక నెల క్రిందట నేను శేషేంద్రగారి కవిత్వాన్ని చదవటం మొదలు పెట్టాను. డా. తంగిరాల, శేషేంద్రగారి కవిత్వాన్ని నాకు వివరించి అందులో నాకు అభిరుచి కలిగించారు. అటువంటి కవి కవిత్వాన్ని కన్నడంలోకి తీసుకురావడం ఆవశ్యకం అనిపించింది. ఇద్దరం కలిసి శేషేంద్ర గారిని కన్నడంలోకి తీసుకురావడానికి నిర్ధారణ చేసుకున్నాం. ఈ అనువాద కార్యం అవుతున్నప్పుడు తెలుగు కన్నడ కవుల మనోధర్మాలు, ఈ మనోధర్మాలు సాహిత్యానికి అన్వయించుకొనేరీతి,

మొత్తం కవిత్వాన్ని గురించి వారి వీరి కల్పనలు నాకు స్పష్టమవుతూ, కుతూహలకరమైన అనేక ఆలోచనలు నాలో ఉదయించడం జరిగింది.

మిక్కిలి స్థూలమైన దృష్టికి శేషేంద్ర, అడిగగారి మనోధర్మానికి చెందిన కవి అనిపిస్తుంది. మానవజీవితం, దాని నిరంతరత, యుగాంతరాల నుండి సాగివస్తున్న జీవనప్రవాహాన్ని గురించిన వేదన, ఆశ్చర్యం, చైతన్య సుప్త చైతన్యాల ప్రోత్సాహం కవిత్వంలో నిరంతరంగా కలిసే రీతి—ఇత్యాది అంశాలు' శేషేంద్రగారి కవిత్వంలోనూ కనబడటం మొదలు పెట్టాయి. కాని శేషేంద్ర గారిలో ఈ ఆలోచనలూ, అఖండిత చింతనా ముందుకు సాగటం వల్ల ఒక అఖండ అంతిమ ఆకారానికి లొంగకుండా, అనేక విడి విడి చిత్త అవారులై రూపొందడం అడిగగారి కంటె పూర్తిగా భిన్నమైన రీతి అనిపించింది.

అడిగగారి కవిత్వం లాగ శేషేంద్రగారి కవిత్వం కూడా కేవల తాత్కాలిక స్వార్థాన్ని ప్రసాదించేది కాదని అనిపించడంచేత, శేషేంద్ర గారి మీద నాకు ఎక్కువ గౌరవం కలిగింది. వారిని

చూడాలి, వారితో మాట్లాడాలి అనే కుతూహలం హెచ్చింది. కాని ఆ ఆశ ఇంత తొందరగా నెరవేరుతుందని నేను అనుకోలేదు.

అడిగ క్షేమేంద్రలు మాట్లాడుతున్నప్పుడు అడిగగారి కంటె క్షేమేంద్ర ఎక్కువ మాటకారి అన్నట్లుగా కనబడ్డారు, లేదా ఆ సాయంకాలం వారు మాట్లాడే మూడ్‌లో వున్నారు అనాలి వారి సంభాషణలో నన్ను ఎక్కువగా తాకిన కొన్ని ఆలోచనలను. ఈ దిగువ ప్రస్తావిస్తూ పోతున్నాను......

క్షేమేంద్ర మాటల్లో ఒక ఘట్టంలో పాశ్చాత్య సాహిత్యంకన్నా భారతీయ సాహిత్యం అంటే సంస్కృత సాహిత్యం మహాత్వమైనదనీ, శ్రేష్ఠమైనదనీ అన్నారు. అడిగగారికి ఈమాట అంతగా రుచించినట్లు లేదు. క్షేమేంద్ర వాల్మీకి మహాత్యాన్ని వివరించడం మొదలు పెట్టారు. "దాంట్లో ఒక్కొక్క శ్లోకం మనకి ఒక్కొక్క క్రొత్త లోకాన్ని తెరుస్తుంది. ఒక్కొక్క పంక్తిలోనూ ఏదో క్రొత్త విషయాన్ని చెప్పడానికి అతడు సిద్ధ

మవుతాడు. మనుష్య స్వభావములోని సూక్ష్మాంశాలను అద్భుతంగా పట్టుకోగల కవి."

అడిగగారు "వైయక్తికంగా నాకు రామాయణం కంటే మహాభారతమే ఇష్టం అన్నారు. శేషేంద్రగారు కొంచెం ఆశ్చర్యపడ్డట్టుగా కనబడ్డారు. అడిగగారు ముందుకు సాగించారు. "రామాయణం ఒక కుటుంబం కథ, ఒక ఆదర్శ ప్రేమ కథ. కాని మహాభారతం ఒక జాతి కథ. ఒక కాలానికి సంబంధించినట్లు ఒక జాతి అధః పతనాన్ని అది చెపుతుంది. ఇంకా ముఖ్యంగా బ్రతుకులోని విషాదాన్ని మహాభారతం చెపుతున్నట్టుగా వుంది బ్రతుకులో చివరికి మిగిలేది ఏమిటంటే శూన్యం. వెనుక శూన్యం. ముందు శూన్యం మధ్య బ్రతుకు."

'నిజం, నిజం' అని శేషేంద్ర ఒప్పుకున్నారు. కాని మహాభారత మూలస్వరూపానికి చాలాభాగం పూర్వంనించే చేరుతూవచ్చింది. మహాభారతం ఒక కవి సృష్టికాదు, ఒక్కజాతి సృష్టి. ఒక్కకవి సృష్టి కాని ఒక కృతిని మహాత్వమైన ఒక అఖండకృతి

అని నిర్ధారించడం ఎలాగ?" ఎక్కడో ఏమిటో ఆలో చిస్తున్నట్టుగా కనబడ్డారు క్షేమేంద్ర.

ఒక క్షణం మౌనం తర్వాత క్షేమేంద్ర అన్నారు. "ఒక దృష్టితో చూస్తే వాల్మీకి వ్యాసుడూ ఇద్దరూ మిక్కిలి లక్కీ అనాలి. కారణం-తరవాత వచ్చిన కవులంతా వాళ్ళిద్దరి వ్యాఖ్యాతలే. అందుచేత వ్యాస వాల్మీకులు ప్రజల్లో కలిసి పోవడానికి సాధ్యమయింది."

అడిగగారు మందహాసం చేశారు: "అవును. అది వ్యాస వాల్మీకుల అదృష్టం అవచ్చు. కాని అదే మన-అంటే సంస్కృత సాహిత్యపు దురదృష్టం కూడా!"

"అంటే ?"

"అంటే వారిద్దరి మహాకావ్యాలు వచ్చిన తర్వాత అనేక శతాబ్దాల వరకూ మిగిలిన కవులు అదే కథని మళ్ళీ మళ్ళీ జపించడం మొదలు పెట్టారు......నిజమైన క్రియాశక్తి వ్యాస వాల్మీకుల కాలానికే ఇంకి పోయినట్టు కనబడుతుంది..."

క్షేమేంద్ర అడిగగారి అభిప్రాయాన్ని ఒప్పు కొని, భాస, బాణభట్ట, కాళిదాస, శ్రీహర్ష మొదలైన వారి కావ్యాలను ప్రస్తావిస్తూ మధ్య మధ్య ఆ కావ్యాల్లోని శ్లోకాలను తమ జ్ఞాపక శక్తితో గడ గడ ఉదహరించారు. "ఈ రోగం ఈనాటికీ వుంది. ఇటీవల తెలుగులో తిరిగి రామాయణ కథ వచ్చింది" అన్నారు. వాల్మీకి రామాయణ కథలో ఉన్న సంపూర్ణ సాధ్యతను కొల్లగొట్టి విడిచాడు. ఆ తర్వాత తిరిగి రామాయణాన్ని పుట్టడంలో అర్థంలేదని క్షేమేంద్రగారి అభిప్రాయం.

'క్రుంగి పోయాడు ఫణిరాయడు రామాయణ కవుల భారంతో' అని మా కుమార వ్యాసుడు వ్రాశాక ఇలా ఆలోచించవచ్చా? లేదా తాను మహాభారతాన్ని వ్రాయ బోవడాన్ని సమర్థించు కోడానికి మాత్రమే ఈ మాట అన్నాడేమో? "రామాయణ దర్శనం" లాగ పాత కథనే కొత్త దర్శనంతో చూడడానికి సాధ్యం కాదా? అని నేను ఆలోచిస్తున్నాను......

మాటలు సాహిత్యంనుండి సంస్కృతి, సంస్కృతి నుండి నాగరికత, అక్కడి నుంచి చరిత్ర.

వేదాలు, ఉపనిషత్తులు, చిత్రకళలు సంగీతం ఇలా సాగాయి. క్షేమేంద్రగారి మాటల్లో వారికి భారతీయ పరంపరలోవున్న గౌరవం ఎక్కువ స్పష్టమయ్యే ట్టుగా వుంది. బలి ద్వీపంలో ఉపనిషత్తుల్లోని ఒక భాగం దొరకడాన్ని వారు చెప్పారు. అక్కడే ఒక దేవాలయాన్ని గురించి వారు ఇచ్చిన వివరణ కుతూహలం రేకెత్తించేదిగా వుంది. మన దేవాల యాల మాదిరిగానే ఆ దేవాలయం వుంది. కాని ఆ దేవాలయంలో విగ్రహం మాత్రం ఉండదు దానికి బదులు కేవలం పీఠం వుంటుంది. పీఠానికి పైన కప్పుకి ఒక కిటికీని పెట్టారు. భక్తులు ప్రార్థిస్తుంటే ఆ కిటికీగుండా దేవుళ్ళు వస్తారనేది అక్కడి నమ్మకం. ఇంద్ర, వరుణ, ఆదిత్య మొదలైన వారు ఆ వచ్చే దేవతలు.

క్షేమేంద్రగారికి సంస్కృతాభిమానం హెచ్చు. తాము తెలుగు కవుల్ని అనుమానంతో చూస్తానని చెప్పారు. కారణం వాళ్ళు సంస్కృతంలో అంతకు ముందే సృష్టింపబడినదాన్ని తెలుగులోకి తీసుకు వచ్చిన రూపాంతరకారులుమాత్రమే., నన్నయ, తిక్కన మొదలైన కవిత్రయంతో సహా. సంస్కృతం

ఒక ప్రాంతం ఒక వర్గం అనే సంకుచితమైన చౌకట్టు దాటి మొత్తం భరత ఖండమంతా వ్యాపించింది. అందువల్ల ఆ భాష మూలకంగా ఎక్కువ విశాలమైన జీవితంయొక్క పరిజ్ఞానం మనకు దక్కింది. అందుచేత ఆధునిక రచయితలు సంస్కృతం నుంచి నేర్చుకోనదగింది చాలావుంది; తెనుగునుంచి అంత లేదు అంటారు.

అడిగగారు తాము సంస్కృత విద్వాంసుల ఇంటిలో పుట్టామనీ, వారి తండ్రి గొప్ప సంస్కృత విద్వాంసులనీ, కాని స్వతః తాము సంస్కృతపండితుడుకాననీ చెప్పి చిరునవ్వు నవ్వారు.

క్షేమేంద్ర ఇటీవల డా॥ తంగిరాల గారి మూలకంగా అడిగగారి కవితల ఇంగ్లీషు అనువాదాలను సంపాదించి చదివారు. "అదికాదు అడిగగారూ! మీకవిత్వంలో అనేక తాంత్రిక యాంత్రిక ప్రతీకలు ఉపయోగింపబడ్డాయి. మీ సంస్కృత సంబంధాన్ని అవి స్పష్టంచేస్తున్నాయి" అన్నారు.

మూడో పతంనుంచి మాటలు సూటిగా ఈ కవుల కవిత్వంపైపే రావడంచేత నా కుతూహాలం ఎక్కువయింది.

'మీభూమిగీతం' అని శేషేంద్ర ఏదో చెప్ప డానికి ఉద్యమించారు. అంతలో మధ్య ఏదో మాట వచ్చి శేషేంద్ర ఉన్నట్టుండి మాట్లాడే ఉత్సాహం పోగొట్టుకొని గంభీరంగా కూర్చుండి పోయారు. శేషేంద్ర గొప్ప భావుక వ్యక్తి అనిపించింది. "చెప్పండి....చెప్పండి....అడిగ గారి కవిత్వాన్ని గురించి ఏదో చెప్పడానికి మొదలెట్టారు" అని నేను అందించగా, "ఓ...ఏమిటో చెప్పాలనుకున్నాను... ..."అన్నారు. కొంచెం సేపయ్యాక నిదానంగా మళ్ళీ ప్రారంభించారు.

"మీ భూమిగీతం గొప్ప మహాత్వం కలిగిన కవిత అనిపిస్తుంది. అందులో ఆత్మయాత్రను గురించి వుంది. నాయకుడు భూమికి పుట్టాడు. అదే కారణంగా అతడికి భూమిని విడిచిపెట్టడం కష్ట మయింది. ఇంకో ప్రక్క ఆకాశం అతన్ని లాగు తోంది ఒకటి వాస్తవం...ఇంకొకటి ఆదర్శం... మధ్య మానవుడు. ప్రపంచపు అనంతతత్వంలో ఆత్మయొక్క వ్యధని మీరు ప్రతీక చేసినట్లుగా వుంది"

అడిగగారి వంటి కవి కవిత్వం భారత దేశపు

ఇతర భాషల్లోకి, ముఖ్యంగా హిందీలోకి అనువదింపబడవలసిన ఆవశ్యకతను గురించి శేషేంద్ర మిక్కిలి ఆసక్తితో చెప్పారు "అన్నట్టు మీకవితలను మీరే ఎందుకు ఇంగ్లీషులోకి తీసుకురాకూడదు?" అని అడిగారు.

అడిగగారు రామానుజన్ మొదలైన ప్రతిభావంతులు మిక్కిలి తృప్తికరంగా తన కవిత్వాన్ని ఇంగ్లీషులోకి తీసుకు వచ్చిన విషయాన్ని ప్రస్తావించారు. అందులోనూ రామానుజన్ ప్రతిభావంతుడైన రచయిత అనీ, ఆయన కన్నడ వచన సాహిత్యాన్ని ఇంగ్లీషులోకి అద్భుతంగా అనువాదం చేసిన విషయాన్ని వివరించారు. ఆ పుస్తకం (**Speaking of Shiva**) తాము చూడాలని శేషేంద్ర కోరారు.

ఈ రకంగా మాటలు సాగినప్పుడు జ్ఞానపీఠం బహుమతి విషయం వచ్చింది. తమకు తెలిసినంతలో తెలుగులో విశ్వనాథ సత్యనారాయణ ఆ బహుమతికి మిక్కిలి అర్హులైన మహాకవి అని శేషేంద్ర అన్నారు. విశ్వనాథ సత్యనారాయణ గారి మీద అతిమాత్ర గౌరవం శేషేంద్ర గారికి.

"ఆయన నా గురువు" అన్నారు. (ఆ రోజు ఉదయమే శ్రీ విశ్వనాథ సత్యనారాయణ గారు మరణించినట్లుగా కన్నడ పత్రికల్లో ప్రకటింపబడింది.) "వారి చివరి కాలంలో నేను వారిని కొంత అశ్రద్ధ చేశానేమో..."అని అంటుంటే శేషేంద్రగారి కళ్ళు చెమ్మగిల్లాయి.

కన్నడ కవిత్వాన్ని గురించి మాటవచ్చినప్పుడు అడిగగారు, బేంద్రేగారి కవిత్వాన్ని ప్రస్తావించి, "బేంద్రే నిజంగా మహాకవి" అన్నారు.

సంభాషణ ఒక నిలకడకు వచ్చాక, శేషేంద్ర గారి అనుమతి తీసుకొని నా ప్రశ్నలు కొన్ని వారి ముందు ఉంచాను.

నేను :— "మీరు కవిత్వాన్ని మాత్రమే వ్రాయడానికి ఏమిటి కారణం ?"

శేషేంద్ర :- "ప్రతి ఒక్క జాతికీ తనదే అయిన ఒక విశిష్ట అభివ్యక్తి మాధ్యమం వుంటుంది. నాజాతి అభివ్యక్తి మాధ్యమం కవిత్వం, వేలాది సంవత్సరాలనుంచి నా జాతి జనులు ఈ మధ్యమాన్ని రూఢి

చేసుకొని వచ్చారు. అందుచేత నాకు ఈ మధ్యమం ప్రియమయింది."

నేను :- "నవల, కథ, వ్యాసం, నాటకం—— వీటికంటే కవిత్వ మాధ్యమం శ్రేష్ఠమైనదని మీరు భావిస్తారా ?"

శేషేంద్ర :- "ప్రాయశః లేదు. నేను మొదటే చెప్పినట్లు నాజాతి మాధ్యమం కవిత్వం ఇంగ్లండుకి నాటకం, రష్యాకి నవల, ఫ్రాన్సుకు పొయిట్రీ వున్నట్లుగా".

(నేను అడిగ గారి అభిప్రాయం అడిగాను)

అడిగ :- "...పైగా కవిత్వం మిగిలిన మాధ్యమాలకన్నా ఎక్కువ సంతృప్తం... గట్టి..."

శేషేంద్ర :- "...అలాగే శబ్ద సాంద్రతను కవిత్వమంత ఎక్కువగా అవలంబించే మాధ్యమం వేరొకటి లేదు. వివరించాలంటే నవలలో అనేక అంశాలను ఉపయోగించి, వాటినుంచి విడదీసి చెప్పదగిన ఏకాంశాన్ని నిర్మించడం జరుగుతుంది.

కాని కవిత్వంలో వస్తువు-రూపం విడదీయడానికి వీలు లేనట్లుగా ఒకదాంట్లో మరొకటి కలిసిపోతాయి. అందుచేత 'ఈ కవిత్వంలో ఇది చెప్పబడింది' అని చెప్పడం కష్టం. అలా చెప్పడంకన్నా కవిత్వాన్నే చెప్పివెయ్యడం మంచిది

అడిగ-: "...అవును. అందుకే వాగర్థాల్ని పార్వతీ పరమేశ్వరులతో పోల్చడం."

(సంస్కృత ఉదాహరణతో క్షేమేంద్ర ఉత్సాహాన్ని పొందారు)

క్షేమేంద్ర :- కవిత్వం అర్థం అవడంలేదు అంటారు కొందరు. కానీ కవిత్వమంటే ఏమిటి? రమణీయార్థాన్ని ప్రతిపాదించే శబ్దం, ఇక్కడ కవిత్వమంటే 'శబ్దం' అన్న దాన్ని చూడండి. 'రమణీయ' అనే మాట గమనించండి 'రమించు' అనే మాట 'రమణీయ' అనే మాటకి మూలం. ఏది పాఠకుడ్ని రమింపజేస్తుందో ఆ శబ్దమే కవిత్వం. అంటే లీనం చేస్తుంది

అతడ్ని Involve చేస్తుంది. ఇలాగ పాఠకుడు కవిత్వంలో ప్రత్యక్షంగా లీన మవుతూనే కవిత్వాన్ని అనుభవిస్తాడు. ఈ రీతిగా కవిత్వం పాఠకుని నుండి సూటిగా తన్మయత్వాన్ని కోరుతుంది, తన్మయత్వంలోకి లాగుతుంది,

అడిగ :- 'రమణీయత' అనేదానికి కేవలం 'సౌందర్యం'అని అర్థం చెప్పకుండా, 'తన్మయత్వం' అని మీరు ఒక క్రొత్త విశిష్టార్థాన్ని ఇవ్వడం బాగుంది.....,

నేను శేషేంద్రగారికి నా రెండో ప్రశ్న వేశాను.

నేను :- "సామాన్యుడి కోసం కవిత్వం వ్రాయాలి అనే విషయంలో మీ అభి ప్రాయం ఏమిటి ?"

శేషేంద్ర :- "అది బోగస్...కొందరు స్వార్థ పరులు లేవదీసిన నినాదం. సామాన్యులు చదివే సాహిత్యం వేరుగా వుంటుంది అటువంటి సాహిత్యం వ్రాసేవాళ్ళని వ్రాయనివ్వండి మనుష్యుల్లో వేరు వేరు అంతస్తులు వున్నట్టుగా సాహి

త్యంలోనూ వుంటాయి. అన్ని అంత
స్తుల సాహిత్యమూ సృష్టి కానివ్వండి.
నేనుచెప్పాలసిందే నేను చెప్పాలి. మీరు
చెప్పమన్నది నేను వ్రాసేటట్లయితే
అది మీ కవిత్వం అవుతుంది కాని నా
కవిత్వం కాదు. కవుల తారతమ్యాలు
తెలుసుకోలేని మూర్ఖుల చేతుల్లోఉంది
మా వర్తమాన తెలుగు సాహిత్యం-

అడిగ గారి అభిప్రాయాన్ని అడిగాను.

అడిగ "ఇది నా స్థాయికి వ్రాయడమా లేక
నా క్రింద స్థాయికి వ్రాయడమా అనేదే
ప్రశ్న, నా అభిప్రాయం, రచయిత
అతని స్వానుభవానికే ప్రామాణికుడు
అయితీరాల్, నా అనుభవము మీకు
తాకడం లేదనే కారణంచేత మీకు తాకే
అనుభవాన్ని నేను వ్రాయడం మొదలు
పెడితే నాకు నేనే మోసం చేసు
కున్నట్టు అవుతుంది. నిజమైన కవి
ఆ రీతిగా తన్ను తాను వంచించుకో
లేడు."

నేను - (క్షేమేంద్ర-అడిగ ఇద్దరినీ గురించి)
"అంటే సామాన్యుడికి మంచికవిత్వమే అవసరంలేదా ?"

క్షేమేంద్ర :- "అది కాదు నా అభిప్రాయం. సామాన్యుడు చదివేది మంచి సాహిత్యం కాదని నేను చెప్పలేదు. ఇప్పుడు జానపద సాహిత్యం చూడండి. అది సామాన్యుడు ఆనందించే సాహిత్యమే కదా! అది నీచమైనదని అనవచ్చా ? మా తెలుగులో వేమనవంటి అనేక కవులు జనసామాన్య కవులుగా జన ప్రియులయ్యారు అయితే ఒక మాట ఇక్కడ గమనించాలి. ఆలాగ పాఠకుడినే దృష్టిలో పెట్టుకొని వ్రాసిన కవిత్వం మిక్కిలి శ్రేష్ఠమైన కవిత్వం అయ్యే అవకాశం తక్కువ వేమనని వ్యాస వాల్మీకుల సరసన కూర్చొబెట్టడం ఏ విమర్శకుడికీ సాధ్యంకాదు.
(మనలో సర్వజ్ఞుడు ఎలాగ కుమార వ్యాసుని సరసలో నిలబడ లేడో అలాగే అనుకోండి.)

నేను :- "సామాజికంగా రచయిత బాధ్యత ఏమిటి ?"

శేషేంద్ర :- "అందరిలాగే రచయిత కూడా సమాజ జీవనం బాగుచేయడానికి పూనుకుంటాడు. దానికోసం తన మాధ్యమాన్ని పాడుచేసుకోకుండా సాధ్యమైన దాన్నంతా అవలంబిస్తాడు.

అడిగ :- "సత్యాన్ని చూడడానికి, చూపించడానికి అతడు ఎప్పుడూ వెనుకంజ వేయడు ఏ సమాజంలో అయినా దాని మేధావుల ధోరణే ఆ సమాజం యొక్క మహత్వమైన యోగ్యమైన మలుపుకు కారణమయ్యేది. దాన్ని ఏ రచయితా మరిచి పోలేదు".

శ్రీ శేషేంద్రగారి దగ్గర, వారి భార్య శ్రీమతి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్ గారి దగ్గర సెలవు తీసుకొని, శ్రీ అడిగ, డా॥ తంగిరాల నేను నగరం రోడ్డుమీదికి వచ్చాం. తెలుగు-కన్నడ భాషలలోని ఇద్దరు మహా కవుల చర్చలో నిప్పు

రవ్వలుగా చిమ్మిన ఆలోచనలు నన్ను చాలా సేపు వెంటాడి పట్టుకున్నాయి. కొన్నింటిని ఒప్పుకొంటూ, కొన్నింటిని అనుమానిస్తూ, ఇంకా కొన్నింటిని వ్యతిరేకిస్తూ నా సొంత ఆలోచనను రూపొందించుకోవడానికి ప్రయత్నించడం మొదలు పెట్టాను.....



# ఋతు ఘోష - ఒక పరిశీలన
# నాటికీ నేటికి శేషేంద్ర
# అంతర్లహరి వర్గచైతన్యమే
(సమాలోచన 16-8-80)

శ్రీ పి. వి. యస్. ఆర్. కె. శర్మ.

కాలచక్ర గమనంలో ప్రకృతిలో గల్గు మార్పులకు చిహ్నములే ఋతువులు. మానవుడు నిత్యజీవన వ్యథాకంటకావృత పథగామియై అనుక్షణము కుందుచు ప్రకృతిచేతనచే ఊరట పొందుచున్నాడు. ఈ జీవిత సుమము నలిగిపోవలసినది కాదు. దీనిలో నెంతయో పరిమళము. సౌందర్యము, గలవని తెలుసుకొంటున్నాడు. ప్రకృతిలో బుట్టి ప్రకృతిలో పెరిగిన ప్రాక్తన మానవునికి వారసుడైన నేటి మానవుడు ప్రకృతి నుండి ఎన్నియో జీవిత సత్యాలను పిండుకొనుచున్నాడు

ప్రకృతి సౌందర్యమునకు ముగ్ధులు కానివారెందరు ? ఇంక కవుల విషయము చెప్పబనియేమి ?

ప్రకృతిని తిలకించి పులకించి కొందరు కవిపుంగవులు ప్రత్యేకముగ ఋతుకావ్యములనే వ్రాసియుండిరి.

గుంటూరు శేషేంద్ర శర్మ గారు రచించిన 'ఋతుఘోష' యను ఋతు కావ్యము ఆరవ దశాబ్దా రంభమున వెలువడిన ఉత్తమ కృతిరత్నము. వారి పద్య రచనా నైపుణి, భావనశక్తి, వారి యాత్మ ఘోష ఋతుఘోషయుం దెల్లెడల విస్తరించి యున్నది.

"నా కవిత్వం నాటినుండి నేటివరకు గమ నించిన వాళ్ళకు ఒక అంతర్లవాహిని అన్నిటిలో అను స్యూతముగా ప్రవహిస్తూ ఉండటం ద్యోతక మౌ తుంది" అని మండే సూర్యుడులో అన్న శేషేంద్ర వాక్యాలు నిజమని తెలియును. నాటినుండి ఇటీవల వెలువరించిన 'సముద్రం నా పేరు' వరకు వీరి కవిత్వ మందంతట సౌందర్య పిపాస, వ్యథార్త జీవుల యథార్థ దృశ్యాలు గోచరిస్తూనే ఉంటాయి.

'వ్యథచే దీనులగాథ కొక్కటయినన్
బాష్పమ్ము రాకున్నచో
పదబంధమ్ములు బంధుర ప్రణయ భావ
స్పందసందోహముల్

మృదుల అమ్మల్ పదివేలు కూర్పు మది సా
హిత్యమ్మె రాహిత్యమై
నిదురం బోవును గాక కాలకుటిలో
నిర్గంధబంధూకమై'[1]

అన్నది వీరి కవిత్వాదర్శము. వసంత ఋతు సౌందర్యంచే పలు విధముల నానందించుచున్నను, కూలివాని దైన్యము ఎదను కలంచగా నీ విధముగా చెప్పినాడు.

'చేలం బూవులు వెక్కిరించె గగన శ్రీ చంద్ర
రేఖాంకమై
వేళాకోళము చేసె తాళవనిలో వేలాది
తారావళుల్
గోలం జేసెను, చింతకొమ్మ వయినం ఘూకంబు
శోకించె నా
కూలీవాడు కుటీరగర్భమున నాక్రోశించె
దైన్యంబునన్.

ఈ విధముగా కవి ప్రకృతికి భావ ప్రపంచానికి తన వ్యక్తిత్వము నాపాదించినతీరు మనల నాకర్షించును.

చలి పులివోలె దారుల ప
　　చారులు చేయుచునుండ ఊరి కా
వల పెనుమఱ్ఱిక్రింద నెల
　　వంక రెయె దీపముగా పరున్న పే
దల పసి పాప లెవ్వరికి
　　తప్పుదలంచిరి ? కాలమే హాలా
హాలమయి పోయి యా శిశువు
　　లాకలితో చలిలో నశింపగన్.

దీనుల యెడ నింత సానుభూతి, జాలిఉన్నది కాబట్టే "ఎక్కడ తిండిలేని పసివాడు దూడను మేతకు తీసుకుపోతున్నాడో, ఎక్కడ పసితనంకూడా బతక డానికి పనిచెయ్యాలో అక్కడ నా కాళ్ళు నిజంగా తెగిపోయాయి నాచేతులు నిజంగా రాలిపోయాయి, నా నాలుక నిజంగా పడిపోయింది. అక్కడ నేను మహాప్రవాహాన్ని కాను: అక్కడ నేను ఝంఝా మారుతాన్ని కాను ఆ పసివాడి కాళ్ళముందు-కడివెడు కన్నీళ్ళుపోశా ఆ కాళ్ల మీద: నా ఆత్మలో ముత్యాలదండ తెగి అతని ప్రోలపడిపోయింది"[2] అని వ్రాసియున్నారు. అనుభూతిలో ఇంతకంటె పరా కాష్ఠ అసాధ్యమైనది కదా !

'పండు వెన్నెల రాదేల పంతగించి చితికిపోయిన
దీనుల జీర్ణ కుటికి,-'
'కన్నుదోయి నీ అమలయూఖరేఖలకు అర్రులు
చాచెను లోక బాంధవా'

'పురాతన ... తనలన్న చీకటుల్ ప్రిదులు
తెరంగునన్ శరత్పురిం గురియింపవదేల నో ప్రభూ!

శిథిల, జీవులు నీరాక కెదురుచూచె

... ... ...

తెరలు తొలగించి రావోయి అరుణమూర్తి'-

మొదలైన విధముగా కవి తన ఆవేద
నను ప్రతి పద్యమునందును వ్యక్తపరచిరి. రిక్షా
లాగు వ్యక్తిని గూర్చి చెప్పిన పద్యము హృదయము
నార్ద్రపరచుచున్నది.

వివిధ నిమ్నోన్నత వీథులం బరుగెత్తి
వైశాఖలో మేను, వాల్చె నొకడు
ద్రాఘిష్ఠ ఘంటాపథమ్ములం దిరుగాడి
బెజవాడ కన్నీరు పెట్టె నొకడు

మధ్యాహ్న పరితప్త మార్గమ్ములం బోయి
గుంటూరులో కుప్పగూలె నొకడు
కాలాహి కుటిలశృంగాటకమ్ముల జుట్టి
నెల్లూరిలో సొమ్మసిల్లె నొకడు

క్రూరదారిద్ర్య దుర్విధికారణమున
తనభుజాగ్రము నెక్కు భేతాళమూర్తి
సర్వకాలానువర్తి రిక్షా ధరించి
లాగలేకను వేసవిఁ సాగలేక

గ్రీష్మమున వివిధ సమయములం దాకాశపు వెలుగు లేవిధములుగా నున్నవో చెప్పిన తీరు మనోజ్ఞమైనది.

ప్రత్యూషముల దిశాఫాల భాగమ్ముల
కెందమ్మివిరిచాయ గీలుకొల్పి
కుతప వేళల విశ్వకుహరాంతరములందు
గుమ్మడి పూవన్నె గుత్తరించు
మధ్యాహ్నముల నభోమండలాధ్వములందు
మల్లెదండల శోభ వెల్లిగొల్పి
అపర సంధ్యల రమ్యవిపిన నిర్ఝరులందు
సిందూరకాంతులు చిలుకరించు

కాలకంధరుని ఫాలాక్షి కాఱుచిచ్చు
దావపావక దీప్తికి జీవగఱ్ఱ
పశ్చిమానిల వీచికి పట్టుగొమ్మ
అవతరించెను గ్రీష్మ కాలాతపమ్ము.

'ఏలాగో ఒకనాడు ఆ శిశువులే
యింధానమౌ గాక యు
ద్వేలక్షోభ నభోంతరాళ మెగయన్
విశ్వప్రజాలోచనో
న్మీలంబై హృదయాగ్ని పర్వత మహా
నిర్ఘోషరోషానల
జ్వాలాజాల కరాళ జిహ్వికలు
తుచ్ఛంబైన ఈ లోకముం
గూలంజేయును గాక; ఈ వచనమే
ఘూర్ణిల్లుగా కంతటన్'

ఆ పద్యములో కోపించిన మహర్షి శాప వాక్కు
ధ్వనించుచున్నది.

దుర్నిరీక్ష్య ప్రభా ధూర్ధరచ్ఛటలతో
క్షేత్ర జీవనుల శిక్షించినాడు
పటురోష కాషాయ కుటిలాంశు కళలతో
రోగణంబుల చావగొట్టినాడు

ఖరమయూఖ క్రూరఘనకాండపటలితో
విహగ జాతుల క్షోభ పెట్టినాడు.'

ఇత్యాదిగా నున్న ప్రచండగ్రీష్మము దుర్జన రాజ్య శాసనముతో పోల్చబడిన పై సీసమే కాక

ఘనఘనాఘన గజగ్రైవేయ ఘంటికా
టంకారములకు ఘంటా పథంబు
శక్రచాపోదగ్ర శార్దూలపాలనా
విభవోన్నతికి భూరిపిపిన సీమ
చటుల ఝంఝామరుచ్ఛతకోటి భేతాళ
లుంరన క్రియలకు రుద్రభూమి.'

ఇత్యాది పద్యమును పరికించిన వీరి పద్య రచనలో శ్రీనాథుని పోకడ లున్నవని పుట్టపర్తి వారు, సోమసుందర్, శ్రీశ్రీ, మొదలైన విజ్ఞులు అభిప్రాయ పడుటలోని సామంజస్యము తెలియ కలదు వ్యావహారిక భాషలో పద్యరచన రస వత్తరముగా చేయగల వీరిశక్తికి క్రింది పద్యము మచ్చుతునక.

'ఓ పరమేశ్వరా ! యెచట
నుంటివి నీవసలుంటివా ప్రజా

శాపములం భరించుటకు
సాధ్యముగాదని పాత పెత్తనం
బీపయిసాగబోపని రెయె
లేని పరారయినావ? బాధలం బాపగ
లేవు నీవు శిలవా కలవా సెలవీయుమో ప్రభూ !'
'ఆత్మపక్షాలను విప్పి లేచెను వికస్వరజీవ మహో
దయమ్ము నన్' అనియు ఊహోవిహాయసమ్ముగా
నెగిరి పోనాశించె నుత్కంఠతో' అనియు ఇంకను
పలు పద్యములందు ప్రకృతిలోనికెగిరి లీనమై
పోయే కాంక్ష వ్యక్తపరచబడినది.

'కలికిగులాబి కేలగొని
కమ్మని తెమ్మెర గుట్టమెక్కి, కెం
పుంపలిరాకు బాకు నడు
ముంగులికింతువుగాని చూడు నీ
జిలుగు పసిండి దువ్వలువ
చీర చెరంగు నభాగ్యశోక పం
కిల కలనాకళంకములు
గీలొక్కనె మేలొక్కనవోయి మిత్రమా !'

ఈ మొదలైన పద్యములను పరిశీలించినచో కవి ప్రకృతి సౌందర్య ప్రవాహమున కొట్టుకొనిపోతూనే వెంటనే గుర్తుకొచ్చిన అభాగ్యజీవుల శోకాన్ని నివారించవలెననే తీవ్ర కాంక్ష ఎంత మిక్కుటముగా గల్గియుండెనో తెలియుచున్నది. ఈ విధముగా వీరి కవిత ఆపాతమధురమూ, ఆలోచనామృతము, నై యున్నది. ఇక్కడ 'ఆలోచన అంటే, ఊహాని పెంచడం, వ్యథల్ని చించడం, సుధల్ని పంచడం (శ్రీ శ్రీ)

'పరిచయ వాక్యాలు'లో పుట్టపర్తివారు శర్మగారికి బీదలపై గల సానుభూతి, వారు బాగు పడవలెననే ఆత్రము. ఇంకా బాగుపడలేదేమనే అక్కసూ. కర్మవాదంపై విశ్వాసమూ, ఇన్ని భావాలమధ్య నలిగిన, నలుగుతూన్న ఆత్మ పెట్టే ఘోష 'ఋతుఘోష' మని తెల్పిరి.

ఈ కావ్యమును శ్లాఘించుచు 'కావ్యతత్వ ప్రకాశము'న విశ్వనాథవారు 'ఇట్టి రచన చేయగల వారీనాడు పట్టుమని పది మందియైనను లేరు' అనిరి.

'హిమబిందు సుందరి', 'గులాబి జిలేబి గిన్నెలు', గ్రుడ్డిముసలమ్మలాగున్న గదిలోదివ్వె' మొదలైన ఉపమానములెంతో మనోహరముగా నున్నవి. కావుననే

శ్రీచాఘురి క్రీడల్లో
ల్లసాని వాడల్లో
కూడా దొరకని పదచిత్రము
విచిత్రం ! కడు చిత్రం !

అన్నాడు శ్రీ శ్రీ.

'సౌందర్య మంటే భౌతిక వస్తువుకు సంబంధించిన దృశ్యం కాదు. వాటిని చూచేటప్పుడు మనలో కల్గే సౌమ్యత, అది అధ్యాత్మిక సౌమ్యతను కూడా వ్యక్తం చేస్తుంది. అట్టి సౌమ్యత మనలో విశ్వాసాన్ని, సత్యాన్ని, సానుభూతిని, న్యాయ ప్రియతను, పెంచుతుంది'[3] అను వాక్యము ఈ కావ్యమునెడ బాగుగా నన్వయించును.

ఇట్లు ప్రతి పద్యమందు చమత్కారము, అలంకారము, ఉక్తి విశేషము కల్గిన ఉత్తమ ఋతు కావ్యము 'ఋతుఘోష.'

అథస్సూచిక :-

1. శేషేంద్ర కవితా సంపుటి 'పక్షులు' లో 'జీవన గంగ' ఖండిక.

2. శేషేంద్ర రచన 'నా దేశం నా ప్రజలు' లో 69 పేజీ

3. 'సాహిత్య ప్రయోజనము' వ్యాసం-[illegible]దూరి. 'సాధన' మాస పత్రిక-సంపుటి 12, సంచిక 2.

---

రెండో ప్రకరణము

## "మండే సూర్యుడు" ఖండికల్లో కవితా రీతి తెలుగు కవిత్వంలోనే కొత్తది

### శ్రీ R. S. సుదర్శనం

శ్రీ శేషేంద్ర శర్మ అచ్చమైన కవి. "ఒక్క పువ్వు రంగును నేను చూస్తూ శతాబ్దాలు బ్రతగ్గలను" అంటాడు. కవిగా కవిత్వతత్త్వానికే ప్రాముఖ్యం ఇస్తాడీయన. కవిత్వానికి సత్యాన్వేషణ, సౌందర్యాస్వాదన, సామాజిక స్పృహ, రాజకీయ-విప్లవ చైతన్యం, ఏదైనా వస్తువు కావచ్చు, ప్రయోజనం కావచ్చు, కాని కేవలం వాటిద్వారా కవిత్వతత్త్వాన్ని నిర్వచించడం కుదురుతుందా? కవియైనవాడు వేసుకోవలసిన ప్రశ్న! ఒకానొక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని కవిత్వ తత్త్వాన్నే విస్మరిస్తున్న నేటి ధోరణుల్ని తీవ్రంగా విమర్శించారు శర్మగారు తన "రక్తరేఖ" (డైరీ)లో. విమర్శ న్యాయంగా ఉంది. అవసరం కూడా.

ప్రయోజనం మాట ఆలోచిస్తే —మనిషి మనుగడను అన్నం, నీళ్లూ, ఆచ్ఛాదన, వీటితోనే నిర్వచించగలమా? **Man does not live by bread alone.** పువ్వు రంగును చూస్తూ మనిషి పొందే ఆనందం ముఖ్యం కాదా! చెవికీ, కంటికీ, సర్వేంద్రియాలకూ కావలసిన సామగ్రి లోకంలో ఎంతో ఉంది. అవన్నీ లేకుండా బ్రతుకు ఎంత దుర్భరం! ఈనాటి అతివాద ధోరణి ఎలా వుందంటే "నేను సైతం ప్రపంచాబ్జపు తెల్లరేకై పల్లవిస్తాను" అనే కవితలో అబ్జానికీ, పల్లవించడానికీ అభ్యంతరం చెప్పేటంత తీవ్రంగా ఉంది. "నేను సైతం కుక్కలు నాకే పుల్లియాకై పులకిస్తాను" అంటే అందులోని వాస్తవికతకూ, సామాజిక విప్లవ స్ఫూర్తికీ వీళ్ళు హర్షిస్తారు! ఇక్కడ కవిత్వ ప్రయోజనం కాదు ప్రశ్న. కవితా సామగ్రి. కవితా సామగ్రి విషయంలో విప్లవం కోరిన శ్రీ శ్రీ అబ్జాలనీ, పల్లవించడాన్ని వదులుకో లేకపోయాడు! వీళ్లు ఆయనకంటే ముందుకు వెళ్లారు. కుష్టునీ, కుళ్లునీ వర్ణించడమే కాకుండా అదే కవిత్వతత్త్వంగా కూడా సిద్ధాంతీకరిస్తున్నారు. కవితా సామగ్రికి, కవిత్వతత్త్వానికీ కూడ సంబంధం లేదని వీళ్లకి చెప్పవలసి వస్తోంది. తీపి

తర్వాత కారము, పులుపు చేదూ వంటి రుచులు కోరవచ్చు. ఆ రుచుల్ని చాల సేపు సహించ లేము. మనస్సు సౌందర్యాన్ని, హాయినీ వదులుకో లేదు. అది మనో ధర్మం, సాహిత్య ధర్మం కూడా అందుకు భిన్నం కాదు! పువ్వుల్ని, పక్షుల్ని, ఆకాశాన్ని, వెన్నెలనీ కవిత్వం మళ్ళీ స్వీకరించక తప్పదు.

"కవిత్వం, స్థూలమైన భౌతిక స్వరూపం నుంచి భ్రష్ట పిండు కున్న తాత్విక బిందువు"; "దృశ్యానికి జీవం యిచ్చే ప్రవాహిని ఏదయితే వుందో దాన్ని పట్టి యిచ్చే 'గ్రథన కౌశలంతో బంధింప బడిన నాలుగు మాటలు కవిత్వం అవుతాయి"; "శబ్దాలు అర్థాలు వట్టి మాటలూ కవిత్వం కావు, కవిత్వానికి కవి సృష్టి కావాలి" అని శర్మ గారి నిర్వచనాలు, కవిత్వం యొక్క విశిష్టమైన అభివ్యక్తిని ఎప్పటి నుంచో వక్రోక్తి, చమత్కారము, ఔచిత్యము, రసము, ధ్వని అంటూ పలు విధాల నిర్వచించే ప్రయత్నం జరిగింది. ఆయా ప్రాచ్య పాశ్చాత్య సిద్ధాంతాల్ని విపులంగా "రక్త రేఖ"లో చర్చించి, తన అభిమతం ధ్వనీ, 'సింబా

లిజమ్'ల వైపు మొగ్గుతున్నట్లు స్పష్టంచేశాడు శేషేంద్ర.

ఈయనకు కవిత్వ ప్రయోజనమూ, కవితా సామగ్రి విషయాల్లో ఆధునికులతో పేచీ లేదు. కాని కవిత్వ తత్త్వాన్ని విస్మరించి పై రెండింటికీ ప్రాముఖ్యం యివ్వడంవల్ల నేడు కవిత్వమే కరవయ్యే పరిస్థితు లేర్పడుతున్నాయనే తన ఆవేదన. "ఆకలి కవిత్వం రాయి, ఆవకాయ కవిత్వ రాయి, పద్యంలో రాయి, నీకు చేతనయిన మార్గంలో నీకు చేతనయింది ఏడుప్. మాకు తగాదా లేదు. కానీ నీవు అసలు కవిత్వం రాయాలి—ఇదీ యీనాడు తలయెత్తే ప్రశ్న. ఈ ప్రశ్న గురించి స్పృహ ప్రజల్లో రెచ్చగొట్టబడాలి......కవిత్వం రాసే విధి విధానాల మీద పట్టుదలలు వదలిపోయిన ఈరోజు కవిత్వం రాసేవాళ్ళకి మరింత ప్రమాదం ఏర్పడిందే గాని మరింత సౌలభ్యం దొరికిందనుకోడం పొరపాటు."

## తిలక్‌తో తులన

శేషేంద్ర కవిత్వాన్ని గూర్చి శ్రీ శ్రీ మొదలు విశ్వనాథ సత్యనారాయణ, పుట్టపర్తి

నారాయణాచార్యులుదాకా ప్రశంసించారు. ఛందో బద్ధమైన కవితతో శ్రీనాథునితోనూ, ముక్తచ్ఛంద రచనలో బాలగంగాధరతిలక్‌తోనూ ఈయనలో సాదృశ్యం కనిపిస్తుంది నాకు. భాషా సౌందర్య రహస్యం ఆధునికుల్లో ఈయనకూ తిలక్‌కూ తెలిసి నంత మరెవరికీ తెలీదనే నా అభిప్రాయం. కాని అంతమాత్రం చేతనే ఈయన కవిత్వం ప్రియం కాలేదు నాకు! చాలమంది రచన ఆపాత మధురమే కానీ, ఆలోచనామృతం కాలేకపోతుంది. శేషేంద్ర శర్మ కవిత్వానికి ఆ లక్షణం లేదు. ఒకవైపు ప్రకృతి సౌందర్యము, రసలోలుపత; మరొకవైపు అజ్ఞాత మైన అతీతమైన తత్త్వ సంస్పర్శ కోసం తహతహ- ఈ రెండింటి సమ్మేళనం ఈయన కవిత్వాన్ని ఆస్వాదయోగ్యం చెయ్యడమే కాదు, మళ్ళీ మళ్ళీ తన వైపు ఆకర్షించేలా చేస్తోంది కూడా.

"ఆసల్ దీరువె దృష్టిచే, మహిత
గాఢాలింగనాయుక్తిచే
నాసంయోగ నిరంత వేదనము లే
యద్వైత సంసిద్ధికో
నైసర్గంబగు నే యగాధ కుహ
రాంతః ప్రజ్వలానందకీ

లా సంతర్పణకో శరీర మొక కా
రాగారమై తోచగన్."
(వసంతర్తువు-ఋతుఘోష)

"శరీర మొక కారాగారమై తోచగన్"-ఈ మాట కీలకంగా తోస్తుంది. ప్రతి ఖండికలోనూ ఎగిరిపోవాలనే ఆకాంక్షను ఏదో విధంగా వ్యక్తం చేస్తాడీయన. పక్షులు, ఎగరడం, ఆకాశం-యివి తరచు ఎదురయ్యే కవితా సామగ్రి."

"ఎవడో చాకలి ఆకలిన్ మరచి తా
నే వన్యమల్లీ లతా
నివహాక్రోడపుటీ తటాకమున నో
నిత్య శ్రమాజీవన
వ్యవసాయం బొనరించుచున్న ధ్వనియే
వ్యాపించె ప్రాపంచిక
వ్యవహార ప్రవిహీన విశ్వహృదయ
వ్యాపారమేమో యనన్."

నిశ్శబ్ద మావహించిన మధ్యాహ్న వేళ చాకలివాడు బట్టలుతికే ధ్వని 'విశ్వహృదయ వ్యాపార" మన్నట్లుగా వినిపించిందట. అంత

ర్మఖుడైన ఋషి ధ్యానానికి కూర్చున్నప్పుడు మనస్సు యింద్రియ వ్యాపారములనుంచి నివర్తిత మయ్యే స్థితిలో వినిపించే హృదయ స్పందనాన్ని ధ్వనిస్తూ, ఋషికీ విశ్వానికీ ఏరపడే తాదాత్మ్యాన్ని సూచించే తీరున సాగిన పై పద్యం ("గీష్మర్తువు") "ఋతుఘోష"లో ఒకానొక ఆణిముత్యం. ఋతు ఘోష' 1963 నాటిది.

కవిలో ఈ అన్వేషణ వాల్మీకి రామాయణం లో అధ్యాత్మిక రహస్యాల అన్వేషణగా పరిణ మించి 1965లో "షోడశి" అనే అపూర్వ పరిశోధన గ్రంథంగా ఫలించింది. అటుపైన ఈయన యోగా భ్యాసం చేసి యోగిగా మారి కవిత్వానికి స్వస్తి చెప్పినా చెప్పి ఉండవచ్చు. కాని ఆ ప్రమాదం తప్పింది. శర్మగారు కవిగానే మిగిలారు. అయితే ఈయనలో వచ్చిన పరిణామం ఏమిటి ?

## నిరీక్ష

దీనికి కొంత వెనక్కి పోవాలి : 1958లో 'నిరీక్ష' అనే ఖండిక ("పక్షులు") ఆనాటి మనస్థితికి దర్పణంలా తోస్తుంది. అందులో చివరి పద్యం...

"ఓ పరమేశ్వరా: ఒక మ
హోజ్జ్వల ప్రేమరసైక రాశినిం
జూపవు, ఈ భయంకర ప
శుత్వము నాపవు గాంగ నిర్ఝరీ
దీపిత శీతశృంగముల
దేలెడు వాయుతరంగ డోలలం
జూపవు నా నిరీక్ష కెపు
డోయి సమాప్తము లోకరక్షకా"?

'ఒక మహోజ్జ్వలమైన ప్రేమరసైక రాశి' కోసం నిరీక్షణమే కాదు. ప్రార్థన కూడా! ఆ ప్రార్థన కారణంగా, "షోడశి" రచనలో చేసిన తపస్సు మూలంగా, జరిగిన దేమిటి? 1968 నాటి 'పక్షులు' అనే ఖండికలో ఈ చివరి పద్యం చూడండి:

"అదిగో ఆ చిగురాకు లందు చిలుకై
ఆనంద మందారమై
మృదుల స్వాదు ఫలమ్ము మ్రుక్కక సము
న్మీలాక్షియై చూచుచు
న్నది యా పక్షి వనున్: క్షణమ్మయిన నుం
డంజాల నిచ్చోట నా
కదిగో సుందర నందనోన రుచి రా
హ్వానమ్ము, నే బోయెదన్."

1958 నాటి ప్రార్థన ఫలించింది. "మృదు" స్వాదు ఫలమ్ముమ్రుట్టిక సమున్మీలాక్షియై చూచుల యిందీవరాక్షి సాక్షాత్కరించింది. వేదనాజీవి ప్రేమోపజీవియైనాడు. "శేషజ్యోత్స్న" (1972) ఖండికల్లో ఎక్కడ చూచినా ఈ ప్రేమసాఫల్యాను భూతి కవితామధుస్రవంతిగా దర్శన మిస్తోంది.

"బహుజన్మల సమూహాలకు పూర్వం
నాలో నీవూ నీలో నేనూ ఉన్నాను కాబోలు...
ఆ కన్నుల్లో దర్శించాను, ఎప్పుడో నిష్క్రమించిన
నా పరిమళాల ప్రపంచాన్ని—"

(ఆ రెండు కళ్ళు)

"నిర్మోహించి రెండు ముక్కలు చెపితే
అవే రెండు రెక్కలయి—ఊహా
విహాయసంలో కెగిరిపోతుంది
అది ఒక గీతం అవుతుంది"

(ఏవో చినుకులు)

"ఓహూ ఏమి జరిగింది నీ కౌగిట్లో నాకు!
తొలి ఋషులు అగ్నికీలల్లో మంత్రగ్రామాలు
దర్శించినట్లు

నీ కౌగిట్లో ప్రేమ జ్యోతిని చూచాను
నేను నీ భౌతికమూర్తి కోసం రాలేదు:
వచ్చా నొక కిరణం కోసం
ఒక కవితా చరణం కోసం
కిరణాల్లో స్నానం చేశాను
మృదుమధుర స్మరణల్లో గానం చేశాను
నన్ను నేను చేరుకున్నాను."

(నీవు)

ప్రేమ కూడా తపస్సే. విరహావస్థలో కంటే సాఫల్యంలో దాన్ని తపస్సుగా, దర్శనంగా, ఆత్మ సాక్షాత్కారంగా అనుభవించడం గొప్ప సంస్కార విశేషము! సాఫల్యంలో ప్రేమ కేవలం లాలనగా అలవాటుగా శైథిల్యంపొందే ప్రమాదం ఉంది. ఏ జయదేవుడువంటి వారో అరుదుగా ఉన్నారు తప్ప మనకు తెలిసిన ప్రేమ తపస్వులైన కవులు చాల వరకు. విరహులే! ఆవిధంగా చూస్తే ఈ కవి అదృష్ట వంతుడు. ఈయన అదృష్టమంతా అచ్చమైన కవిగా లక్ష్యశుద్ధీ చిత్తశుద్ధీ కలిగి ఉండటమే. అదే ఈయ నకు జీవితంలోనూ శ్రీరామరక్ష!......



శేషజ్యోత్స్న రాస్తున్న కాలంలో శేషేంద్ర
(1968 జ్ఞాన్ బాగ్‌లో



సాహిత్య కౌముది ఆవిష్కరణ సభ (1968) శీలం సిద్ధారెడ్డి, శ్రీ శేషేంద్రశర్మ, శ్రీ దివాకర్ల వేంకటావధాని ఉన్నారు. రాజ్‌కుమారి ఇందిరాదేవి గారు అధ్యక్షత వహించి ఉపన్యసిస్తున్నారు.

తనలో కవిగా భావుకుడుగా వస్తున్న పరిణామాన్ని అవగాహన చేసుకునేందుకు ఈయన చేస్తూన్న ప్రయత్నం 'రక్తరేఖలో' ప్రతి ఫలిస్తుంది. ఏ మార్పు వచ్చినా ఈయనకు చిన్న పిల్లలమీదా, పశులమీదా, పువ్వులమీదా ఉదయాస్తమయాల మీదా ఉండే ఆప్యాయతా, మోజు తగ్గదు. 'ఎందుకు వస్తున్నాయి ఈ అందమైన భావాలు నిశ్శబ్ద బంధురమైన నా మందిరంలోకి?" ('అందాల అతిథులు') అని తన్ను తనే ప్రశ్నించుకుంటాడు. నీలాకాశంలో "తెలిమబ్బులై పొండి, సాగరాల్లో నావల తెరచాపలై పొండి, దూరతీరాలకు తరలి పోయే పవనాలయి పొండి, రేపటి గులాబీల తోటల్లో ఉషస్సులై పొండి!" అంటూ అంపకాలు పెట్టి లోకం మీదికి తన భావాల్ని వెదజల్లుతూనే ఉంటాడు—శేషేంద్రశర్మ అచ్చమైన కవి!

## తెలుగు కవిత్వానికే కొత్త రీతి

"మండే సూర్యుడు" (1974) లోని ఖండి కల్లో కవిదర్శనం (poetic vision) మరో స్థాయికి చేరుకోవడం చూస్తాము. వైయక్తిక ప్రేమానుభూతి అనే సౌధోపరితలంనుంచి రోదసిలోకి చూపు

సారించి మానవతా ప్రభాతాన్ని తిలకించి ఉద్విగ్నుడై నెచ్చెలితో అంటున్నాడు!

"నీవు నమ్మతావా నెచ్చెలీ...
కాల చక్రం తిరిగి తిరిగి
జీవితాన్ని క్రాసుగా మనిషిని క్రైస్తుగా
మలిచిన ఈ రోజు
ఒక నూతన యుగసూర్యుడు ఉదయిస్తున్నాడు
మనకు కానుక తెస్తున్నాడు
ఒక నూతన గీతను
విప్లవాన్ని వీరమరణాన్ని ఉద్ఘోషించే
ఉచ్చైస్వర గీతను

(నూతన తీరాలు: శేషజ్యోత్స్న)

"ఓహ్! మన మనోద్వార తోరణానిం
మానవతా సూర్యుడు జ్వలత్ జ్వాలాగుళుచ్ఛమై
వ్రేలాడుతున్నాడు
భాషలు ఆరవేసిన వలువల్లా ఎగిరిపోతున్నాయి
దేశాల సరిహద్దులు ఈ ఝంఝామారుతాల ధాటికి
గజగజ వణకి పోతున్నాయి
మానవత నగ్నంగా ఉద్విగ్నంగా

నూతన వ్యక్తీకరణ కోసం చూస్తోంది
దిశాంతాల్లోకి"...

(గాలులు: శేషజ్యోత్స్న)

"శేషజ్యోత్స్న"లో ప్రధానంగా నెచ్చెలి సాన్నిధ్యం ఉన్నది. దర్శనాన్ని ఆమెతో చెప్పడం ఉన్నది. ఆ సంపుటిలోనే 'గోపురాలు' అనే ఖండికలో కవి చెలి సాన్నిధ్యం నుంచి నూత్న యుగస్వప్నంలోకి ఎగిరిపోయి స్వప్నతూలికలతో భాషిస్తూ ఇలా అంటాడు

"ఓ స్వప్నతూలికలారా!
మీ కోసం చూచే
మా కన్నుల రంగుల చేపల మీదికి
ఎందుకిలా కన్నిటి వలలు విసురుతారు
మా యినప నరాల తీగెలు త్రెంపకండి
అందులో నిదురించే గొంతు జాగృతమైతే
మండే సూర్యుడు రెండు ముక్కలుగా విరిగి
మనిషి కళ్ళుగా మారుతాడు
ఆకాశం కూలిపోతుంది
సముద్రాలు పారిపోతాయ్..."

(గోపురాలు: శేషజ్యోత్స్న)

మానవ సూర్యుడు కవితాహృదయానికి, మానవతాభావంతో నూతనయుగోదయ కాంతుతో తీవ్రంగా ప్రజ్వలించే కవి ఆత్మకు ప్రతీక. ఇందులో మానవ చరిత్ర, మానవుని జయాపజయాలు. మానవుని ఆశలు, మానవుని భవిష్యద్వర్తమానాలు అన్నీ అన్నీ కవళికలుగా అభివ్యక్తిలో దర్శన మిస్తాయి.

"నేను చెమట బిందువుని
కండల కొండల్లో ఉదయించే లోకబంధువుని
గుండెలతో నాకు దోస్తీ
నేనుండేది బాధల బస్తీ
సింధువంత చరిత్ర నా పిడికిట్లో ఉన్నా
చెప్పకుండా మనిషిని చెక్కిన శిల్పిని..."

(మండే సూర్యుడు)

మానవుడు శ్రమజీవి. ప్రేమజీవి, వేదనాజీవి. మానవ చరిత్ర ఒక సముద్రం. కాని మానవుడు- మానవత నిర్వచనానికి అందవు. మానవుడు చెప్పి చేసే శిల్పం కాదు! ఎప్పటికప్పుడు రూపు దిద్దుకునే ఒక సృజనాత్మక శక్తి, మానవునిలో ఉండి మాన

వతగా అభివ్యక్తమయ్యే శక్తి—దీనికి, ప్రాణికోటికి జీవనాధారమైన సూర్యరశ్మికీ తాదాత్మ్యం ఊహించినప్పుడు మండేసూర్యునికి, జాగృతమై ప్రజ్వలించే కవి హృదయానికీ గల తాదాత్మ్యం మనకు బోధపడుతుంది. "మండే సూర్యుడు రెండు ముక్కలుగా విరిగి మనిషి కళ్ళుగా మారుతాడు" అనడంలో కవి జాగృతియే మానవునిలో సమాజ దృక్పథంగా పరివర్తన చెందిననాడు భూమి మీదే అద్వైతం సిద్ధిస్తుంది; ఆశలు ఫలిస్తాయి (ఆకాశం కూలిపోతుంది), చరిత్ర ముగుస్తుంది (సముద్రాలు పారిపోతాయ్) అనే అభ్యూహ ధ్వనిస్తోంది.

"నా కవిత్వం నాటి నుంచీ నేటి వరకూ గమనించిన వాళ్ళకు ఒక అంతర్వాహిని అన్నిటిలోనూ అనుస్యూతంగా ప్రవహిస్తూ ఉండడం ద్యోతకమవుతుంది. అదే ఈ మండే సూర్యుడు పుస్తకంలో మొదటి పద్యంలో స్పష్టమైన రూపం ధరించింది. అదే ఈ కవి జీవనాడి" అని శేషేంద్ర చెప్పుకోడం సముచితంగా ఉన్నది.

ఏమంటే. ఈయన "ఋతుఘోష" లోని వైయక్తికమైన ఆవేదన నేటికి మానవత్వపు స్వరంవే

దనగా "మండేసూర్యుడు"లో గొంతు విప్పుకున్నది ఈ ఖండికల్లోని కవితారీతి తెలుగు కవిత్వంలోనే కొత్తది అని చెప్పడం అతిశయోక్తి కాదు. 'రీతి' విషయంలో ఎందుకో నాకు వాల్ట్ విట్‌మన్ కవిత్వమే స్ఫురణకు వస్తోంది, "మండే సూర్యుడు" చదువుతూ ఉంటే! కానీ ఎంత వెదికినా భావాల్లో పోలికగానీ అనుకరణచ్ఛాయగానీ రాలేదు:

"Over the mountain growths disease and sorrow
An uncaught bird is ever hovering, hovering,
High in the purer happier air.
'From imperfection's murkiest cloud,
Darts always forth one ray of perfect light,
One flash of heaven's glory
"To fashion's custom's discord,
To the mad Babel-din, the deafening orgies,
Shooting each lull a strain is heard, just heard,
From some far shore the final chorus sounding.
"O the blest eyes, happy hearts,
That see, that know the guiding thread so fine,,
Along the mightly labyrinth"

(*from "Birds of Passage*)
***Walt Whitman***

"ఎక్కడ పేరులేని పక్షి
కొమ్మల్లో కూర్చున్న మాటాడిన

పరిసరాలు పద్యాలుగా మారుతారో
ఎక్కడ ఎర్రయూకలిప్టస్ చెట్టు
సంధ్యలో స్నానం చేసి ఆకుల కొసల్లో
ఎర్రపూల బిందువులు వేలాడుతుండగా
ముందుకు వస్తుందో
ఎక్కడ ముద్దుగా ఇంటిమీదికి ఒరిగిన
జాబిల్లి ముద్ద
చేతి కందుతా డనిపిస్తుందో

అక్కడికి, ఆ కల లోయల్లోకి
పోదాం పదమంటుంది ఆత్మ
నగ్న వృక్షాల చారినించి
తప్పించుకుని
శాంతియాత్ర చేద్దాం
పదమంటుంది——"

(శాంతి యాత్ర : ముండే సూర్యుడు)

శేషేంద్రకూ వాల్ట్ విట్‌మన్‌కూ గల సంబంధ మేమిటో అది హృదయైక వేద్యముం మాటల్లో తూచీ, భావాలతో కొలిచీ నిరూపించే. దుకు వీల్లేనిది !

ఈ కవిత్వాన్ని దాని రీతినిబట్టి, కొన్ని భావచిత్రాలనుబట్టి, కొన్నిచోట్ల వస్తువునుబట్టి కాల్పనిక కవిత్వమనీ (Romantic Poetry), మర్మ కవిత్వమనీ (Mystic poetry) ముద్రవేసి తోసెయ్యడానికి వీల్లేదు. ఇందులోని వాస్తవికత, విప్లవ చైతన్యమూ, వ్యంగ్యమూ ఎంత పదనైనవో 'మరో దేవుడు' అనే ఖండిక ఒకటి చూస్తే తెలుస్తుంది.

"కందరాల కంఠానికి లొంగి
ఇక్కడ
ఆకాశం సూర్యుడ్ని అమ్మకుంది.
గుప్పెడు నక్షత్రాల కోసం"

[ధన ప్రలోభంతో సృజనశక్తిని కోల్పోవడం]

"ఇన్నేళ్ళు రాసిన కాగితాలన్ని
హిమాలయ పర్వతాలైనాయి
వాటిమీద వాడిన సిరా
వక మధ్యధరాసముద్రమయింది"

[కావ్య పురాణాలు, మతబోధలూ, తత్త్వ సిద్ధాంతాలు పనికి రాకుండా పోవడం]

"రైతు నాగలి మోస్తున్నాడు
క్రీస్తు శిలువ మోసినట్లు

ఈ దేశపు గర్భగుడిలో
దేవుడు జీర్ణమై పోయాడు
ఆకలి వేస్తోంది
మరో దేవుడి కోసం"

[వ్యాఖ్యానం అనవసరం]

"మండే సూర్యుడు" సంకలనంలో శేషేంద్ర కవిగా ఎంతో ఎత్తుకు పెరిగాడు. తనదైన రీతిని స్పష్టంగా రూపొందించుకున్నాడు. ఈకవితల్లో శ్రీనాథుడూ లేడు. తిలక్ నీడా లేదు! ఒక్క శర్మమాత్రమే ఉన్నాడు. "దిగంతరేఖ మీదికి ఎక్కే సూర్యుడ్ని కావలిస్తే నీ వేలిమీదికి ఎక్కిస్తా ఒక ఉంగరంకిగా" అని ధీమాతో అనగలుగుతున్నాడు. ఎక్కించినా ఆశ్చర్యపడవలసిందేమీ లేదు. అటువంటి మహా కావ్యం కోసమే నిరీక్షిస్తాను

(అనంతపురం 28-2-75)



# యుగకవి శేషేంద్ర

డా॥ మాదిరాజు రంగారావు
విఖ్యాతకవి,
కాకతీయ విశ్వవిద్యాలయం, వరంగల్లు.

వివిధసంస్థలు "యుగకవి--శేషేంద్ర" ప్రచురించి చాలామంచిపని చేశాయి. ప్రధానసంపాదకులు శ్రీ సుబ్రహ్మణ్యంగారిని అభినందిస్తున్నాను. ఈ గ్రంథం మీ Startling literary personality ని ప్రతిబింబించేది - మీ scope ఒక horizon లాంటిది. ఈ నాటి తెలుగుకవుల్లో ఎవరికీ ఈ background లేదు. ఈ horizon లో ప్రత్యక్షమయ్యే ఉదయసంధ్య-సాయం సంధ్య - రాత్రి - చీకటి - వెన్నెల ఇంకా ఇంకా ఎన్నో వర్ణ చిత్రాల సంకలనమే ఇది. ఈ సంస్థలు చేసిన ఈ కృషి గణనీయమైంది. ఎందుకంటే మునుముందు పరిశోధనకూ సమాలోచనకూ ఇది ఎంతగానో ఉపకరిస్తుంది. ఈ ఉత్తరం వ్రాస్తూ ఎదుట ఉన్న ఒక మిత్రునితో అంటున్నాను "శ్రీ శర్మగారి నవ్యమైన గాఢమైన ఉజ్జ్వలమైన వ్యక్తిత్వం యొక్క రేఖా చిత్రం ఇది" అని.

శ్రీ సోమసుందర్ గారి "ఇరవయ్యోకటో శతాబ్దిలో ఉపస్తార" అనుభూతి దఘ్నమైన భావుకత, వెలుగు ప్రసరించే వ్యాఖ్యానంతో ఇటీవల వచ్చిన ఉత్తమ విమర్శన గ్రంథాల్లో అగ్రపీఠం వహించేది.

ఇరవై రెండు శ్రుతి గతులలో వచ్చినను నీరై పారిపోయింది" కావ్యంసీమలూ, ఆచారాలూ వేషాలూ, భేషజాలూ, నియమాలూ మొదలైన అనేకవలయాల నతిక్రమించి "Universal Place" లో ఉంది జీవి సంస్కార తంత్రుల్ని మీటేదీ, అనుభూతుల్ని మేల్కొల్పి పరిమళింప జేసేదీ నిరంతరమైన మీ కృషిపరంపర ఆధునిక కవిత్వానికిచ్చే క్రొత్త క్రొత్త సూచనలు - ఈ కావ్యాన్ని సుస్థిరం చేసేదిగా భావిస్తాను.

(28-5-71)

డా. సుప్రసన్నాచార్య
సుప్రసిద్ధకవి,
కాకతీయ విశ్వవిద్యాలయము,
వరంగల్లు.

ఒక పొయెట్ ని ఇలా assess చెయ్యడం తెలుగుదేశంలో చాలాకాలం తరువాత గానీ జరుగదు. ఎంతసేపూ ignore చేయటం, కాకపోతే

మామూలు ప్రోత్సాహవచనాలు పలకడం సాగుతుంది.

అయితే మీ కవితలో ముఖ్యంగా శేషజ్యోత్స్న, మండేసూర్యుడు, నాదేశం నాప్రజలు వరుసగా తెలుగుదేశంలో నిశ్శబ్దముగా తుఫాను తెచ్చాయి. రాజకీయ దుర్వాదాల దుమ్ములో ఆగమైపోతున్న వేళ స్వచ్ఛమైన కవితాజ్యోత్స్నతో మండే సూర్యతేజస్సుతో దేశాన్ని ప్రజల్ని దర్శించారు, దర్శింపజేశారు కవితాలోకంలో మీరు.

మీతో ఒకక్రొత్త కవులతరం తెలుగుదేశంలో మేల్కొన్నది. దాదాపు అది ఈ శతాబ్దపు తెలుగు దేశంలో మేల్కొన్న కాల్పనికకవి పరంపర కంటే ప్రతిభావర్షం కురిపించవచ్చును.

మీ కవిత తెలుగు కవిత్వానికి అపూర్వమైన Richness ఈనాడు సమకూర్చడమే కాకుండా మూడు కాలుష్యాలను నివారించింది. 1. రాజకీయ కాలుష్య నివారణ, 2. అయోమయం తొలగించడం 3. దేశపు హద్దులను చెరిపివేసి ఇతరభాషలవారికి చేరడం.

ఎందరో ఈనాడు వినబడుతూ ఉన్న కవులు కొద్దిరోజుల్లో వినబడకుండా అయిపోతారేమోనని ఈ శతాబ్దిలో మిగిలి, వినబడే కొద్దికవుల్లో మీరు ఉంటారని నాకు తోస్తున్నది. చాలామంది కవులు ఒకటి రెండు కావ్యాలకే ఇగిరిపోతారు. వరుసగా కావ్యసందోహం వెలువరిస్తూ కూడా మీగుండెల్లో కవితాపయస్సు ఇంకిపోవడంలేదు. అది తెలుగుభాష అదృష్టమే.

(28-5-76)

శ్రీ పిలకా గణపతిశాస్త్రి
చెన్నపురము.

యుగకవి శేషేంద్ర చదివి నేనెంతగా ఆనందించానో మీరూహించుకోలేరు! మీకిదే నా ప్రగాఢ ఆత్మీయుతాభినందన! మీకు అంతర్జాతీయ విఖ్యాతి లభించాలని నా ఆకాంక్ష. తెలుగువాడు రచ్చ గెలిచినా ఇంట గెలవలేడనుకుంటాను. మీ అభినందన లేఖలలో విఖ్యాత విమర్శక మిత్రులు శ్రీ సుదర్శనంగారి వ్యాఖ్య నన్నెంతగానో ఆకర్షించింద. మిత్రుడు శ్రీ శ్రీ అభినందన కూడా అలాగే అమూల్యమైనదే.

(2-6-76)

## 'యుగకవి శేషేంద్ర'
## చర్చలు—లేఖలు ఈ తరానికి చెందిన సాహిత్యపు చెలియలి కట్ట

సౌమిత్రి

సింహాపురి తేది. 30-6-76

యుగకవి శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మ గారిని తెలియని తెనుగు పాఠకుడు వుండడు. శేషేంద్ర సాహితీ వీచికలు తెనుగు నాటంతా పరుచుకుపోయిన యుగం యిది భారతదేశమంతా సాహితీయాత్రలు చేసి తెనుగువాడి సాహితీ కీర్తి జండాను ప్రతి రాష్ట్రంలోనూ ఎగ వేసిన కీర్తి శ్రీ శర్మగారిదే! ఈ విధంగా సాహితీయాత్రలు చేసి తెనుగు సాహిత్యపు ఘుమఘుమలను ఎగ చల్లిన ఆఖరుకవి శ్రీనాధుడు. ఆయన వారసుడు శేషేంద్ర.

పదాలు శర్మగారిచేతిలో పరుగెత్తే గుఱ్ఱాలు పదాల గారడీ శర్మగారికే చెల్లు గారడీతో సరిపెట్టుకొనే మనిషిగాదు;- గారడీ తనకొక ప్రక్రియ; జనాన్ని ఆకట్టుకోడానికి మాత్రమే. శర్మగారు యువతమీద జూపే ప్రేమ, యువతమీద చూపే ఆశ యీ యుగంలో మరేకవీ చూపటం లేదంటే అతిశయోక్తిగాదు! రేపటి పెత్తనందారే యీనాటి యువకుడు! అతని చేతికి సరైన పెత్తనపు కళ్ళెం నివ్వాలంటాడు :

శర్మగారి కవిత్వంలో అంతా యువతమీద జాలి. యువతకు మేలొంగల్పు కన్పిస్తాయి ! జీవితాన్ని నిర్వహించలేని డిగ్రీలకు దూరమై, జీవితాన్ని అనుభవంలో చెప్పే పచ్చటి పొలాల మధ్యకు యువతను ఆహ్వానించే శర్మగారి ప్రభాత కంఠాన్ని తెనుగు దేశం యిప్పుడే నిద్రలేచి, కళ్లు తుడుచుకొని చెవ్వులప్పగించి వింటూ వుంది. అంటే శర్మగారి భవిష్యత్ కార్యక్రమానికి పూర్వవేదిక యేర్పడిందన్న మాట ! అంతేగాదు శర్మగారి పాక నడకలో తమకలాలకు యువత అడుగులు నేర్పిస్తూంది !

అందుకే ఈ కవిని ఈ గ్రంథ సంకలన కర్తలు యుగకవి అని సంబోధించటంలో సంపూర్ణమైన అర్థమున్నది. సంకలనకర్తలందుకు అభినందనీయులు.

శ్రీ శర్మగారి అశేషకవితాబంధుజనం భారతదేశమంతా వున్నది. వారంతా శ్రీ శర్మగారితో ప్రతినిత్యం ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూనే వుంటారు.

అంతమంది అభిప్రాయాలను ఒక్క చోటుకి తీసుకునిరావాలనే సత్సంకల్పంతో తెనుగుదేశంలోని ప్రసిద్ధ సాహితీ సంస్థలు యుగకవి శేషేంద్ర చర్చలు లేఖలు పేరుతో యీ బృహత్తర గ్రంధాన్ని తీసుకురావటం తెనుగు సాహితీ నూతన ప్రక్రియా వేదికకు మామిడి తోరణం కట్టినట్లే!

ఈ గ్రంథానికి ప్రధాన సంపాదకుడుగా కర్తవ్యాన్ని చక్కగా నిర్వహించి, సుదీర్ఘ ఉపోద్ఘాతము వెలయించి ఈ నూతన ప్రక్రియా గ్రంథానికి నాందీపలికిన శ్రీ ఆకుల సుబ్రహ్మణ్యం ఈ సందర్భంలో ఎంతైనా అభినందనీయుడు.

సాహితీవేత్తలకు పసందైన గ్రంథమిది! అపర శ్రీనాథుడైన గుంటూరు శేషేంద్రశర్మగారి మీద భారతదేశసాహితీలోకం యేర్పరచుకొన్న ఆశల ప్రతి రూపమయ్యే యీ గ్రంథం!

---

"నన్ను కవిఅనకు. నేను కలల వర్తకుడ్ని నా బజార్లో నీ కళ్ళు రెండు విలువైన భూగోళాలు"

—ప్రేమలేఖలు

"సముద్రం ఒకడి కాళ్ళదగ్గర కూర్చుని మొఱగదు, తుఫానుగొంతు చిత్తం అనడం ఎరగదు. పర్వతం ఎవడికీ వంగి సలాం చెయ్యదు"

"బాబూ ఇవాళ మనమంతా నదిలో మునిగి పోతే పోవచ్చు. కానీ రేపు నదే సముద్రంలో మునిగిపోయే రోజురాక పోదు"

—గొరిల్లా

"ప్రేమకన్న ద్వేషంవైపే నడుస్తారు మనుష్యులంతా సూర్యమండలానికంటె సూర్యగ్రహణమే వింత"

—ప్రేమ లేఖలు

మూడో ప్రకరణం

# మహాకవి శ్రీశ్రీ

"శేషేన్ శేషేన్
నీ పొయెమ్సు చూసేన్
పసందు చేసేన్
నీ ఋతుఘోష నీ
ఛందస్సుల రోష్ణీ
మధుర మంజుల భాషిణి
ఇంద్రా ఇందిరా !
ఎంచకని విందురా
ఇంకెక్కడ కందురా
ఖేష్మైన తర్జుమా
తేలికైన కర్జమా
నీది మంచి పద్యమా
లేక ఫ్రెంచి మద్యమా
కవిరేవ విజానాతి

శ్రీకవిదేవ సుధాగీతి
(శ్రీ)నాథుడి క్రీడల్లో
అల్లసాని వాడల్లో
కూడా దొరకని పదచిత్రం
విచిత్రం కడు పవిత్రం
ధుమాగా ఉంది ఇమేజి
రమారమి కవుల సమాధి—
and the translation
is a magical transformation
crystalline and Prestine"

"ఇదిగో ఆకాశం సవాలుగా మనిషిమీద ఎండను విసిరివేస్తే మనిషి బంతిగా ఎగరగొట్టాడు సూర్యుడ్ని ఆకాశంలోకి" (మండేసూ)

"ఓడినప్పుడు ఒక్కనిందలేదు ఒక్కనిట్టూర్పు లేదు; నీ రస్తాలో వీస్తున్న చలిగాలితప్ప వీధి లాంతర్లు ముద్దులుముద్దులుగా కక్కుతున్న గుడ్డి కాంతితప్ప-గెలిచినప్పుడు తప్పట్లులేవు తమాషా ల్లేవు వాల్ పోస్టర్ల కరతాళధ్వనులు ఒంటరితనపు వికటాట్టహాసాలు తప్ప" (మండేసూ)

# పశువులు

**ఆయాచితశ్రీ**

ఇదివరలో పత్రికల్లోనో, సంచికల్లోనో ప్రకటించబడి కాలకోటర కులాయంలో నిద్రిస్తున్న పద్యాలు పుస్తకరూపాన్ని ధరించి, పశులవలె కవితా ప్రియుల చేతులపై వ్రాలుతున్నాయి. అందువల్ల గ్రంథనామం సార్థకమై ఉన్నది.

విద్వాంసులు, సునిశితవిమర్శకులు సహజ కవితా కళాసంపన్నులు అయిన శ్రీ క్షేమేంద్రశర్మగారు ఆంధ్రపాఠక లోకానికి సుపరిచితులు. కవిత్వపు లోతుపాతులు బాగా తెలిసినవారు. పాతఫక్కీ కవిత్వంవలెనే నవ్యకవిత్వాన్ని కూడా నల్లేరుమీద బండి నడిపినట్లు నిరాఘాటంగా సాగించగల సవ్యసాచులు ఉభయపద్ధతుల కవిచక్రవర్తుల ప్రశంసలను పొందగలిగిన ఉత్తమ కవులు.

కవితధరించే బాహ్యావేషం ఛందస్సు...పశ్చిమ దేశాల్లో ఛందస్సు విగళితంకావడం కవితలో

రూపానికి ప్రాధాన్య నశించడానికి సంకేతమైతే ఇక్కడ ఒకరూపాన్ని తోసేసి మరొకరూపాన్ని స్వీకరించడం మాత్రమే అయింది పశ్చిమదేశాల్లో ఒకవైజ్ఞానిక సముల్బణ పరిణామ ఫలితంగా ఛందస్సు కవితనుంచి తొలగిపోగా, తెలుగుదేశంలో అది సమకాలీన రాజకీయ వాతావరణం కారణంగా తొలగిపోవడం ప్రారంభించింది, అని ఆధునికమైన వచనపద్యాల కవితనుగురించీ, సాధారణంగా కవితా స్వరూపాన్ని గురించి ఈయన చెప్పినది ఎంతో ఉచితముగాఉన్నది. కవితకు ఛందస్సు ముఖ్యంకాదు. రసవంతమైన వాక్యంకూడా కావ్యమని మన ప్రాచీనులే నిశ్చయించారు. హృదయంగమంగా లేకుండా అది పద్యమయినా, గద్యమయినా రాణించదు. శ్రీ శర్మగారి కవితలు ఏ పద్ధతిలో రాసినా ఇంపుగానే ఉంటాయి. కవిత్వం ఎలాఉండాలో బాగాపరిశీలించి మరీ రచన సాగించడమే దీనికి కారణమని తోస్తుంది.

ఈ 'పతుల'లోని కవితలలో రెండువంతులు పాతపద్ధతికి, ఒకవంతు క్రొత్తమార్గానికి చెంది

ఉన్నవి. వీటిని పఠించి ఊహించి ఉత్తమభావాలను గ్రహించవచ్చును. కొందరి కవితలలోవలె ఊహకు అందని భావాలు కానరావు.

'మూర్ఖుడు గడియారంలో
ముల్లు కదలనీకుంటే
ధరాగమన మంతటితో
తలక్రిందై పోతుందా'

ప్రాచీన సంప్రదాయ కవితకూడా సుప్రసిద్ధ కవుల రచనవలె ఎంతో ప్రౌఢంగా, రసవంతంగా సాగింది. నవయుగకవులలో శ్రీ శర్మగారు ఉత్తమ శ్రేణికి చెందినవారనీ చెప్పవలసి ఉన్నది.

"ఈ చేత్తో నేను ఏ అందాన్ని సృష్టించలేదు? ఏది ఈ భూమిలో ఈ చేతికి లొంగలేదు? కానీ ఈ చెయ్యి ఖాళీగానే ఉండిపోయింది శాశ్వతంగా!"
(నా దే-నా ప్ర)

కొమ్మల్లో ఆకుల మాటునచూస్తే అగుపిస్తాయ్ పక్షుల అడుగులు, నిరుడు ఎగిరిపోయిన నిమిషాల గురుతులు" (నా దే-నా ప్ర)

# ఋతు ఘోషః

**సరస్వతీపుత్ర శ్రీమాన్**
**పుట్టపర్తి నారాయణాచార్యులు**

కాళిదాసు ఋతు సంహార కావ్యం ప్రసిద్ధమే; నేటి ఆంధ్ర మహాకవి తెలుగుఁ ఋతువులను వర్ణించినాడు. అసలు-కాళిదాసును ఋతువులను వర్ణించుటకు ప్రేరేపించినవాడు వాల్మీకి. కాని యెందరు వ్రాసినను యీ నాటికిని ఋతువర్ణనకు వాల్మీకినే చదువవలె ననిపించడం చిత్రం. 'విశ్వనాథ' వారి తెలుగు ఋతువులు తెలుఁగు దేశంలో కనపడే ఋతువులన్నమాట. వారు వర్ణించిన ప్రకృతి శోభలు - తెలుగు దేశంలోనే యేమిటి - యితర రాష్ట్రాలలోనూ కనిపిస్తాయి. ఆంధ్రదేశ లక్షణాలను ముఖ్యంగా, తక్కిన వానిని అనుషంగికంగా చెప్పినారని పేరును సమర్థింప వచ్చును. ప్రబంధాలలో ఋతువర్ణనలేని రచనలేదు. కొందరి కవిత్వాలు బాగనే ఉన్నా అనేకుల రచనలు విసుగునే కలిగస్తాయి. ఇంతకూ ఈనాడు ఋతువులు వాటి

అందాలు పుస్తకాలలోనే చదువుకోవలె. ఆంగ్లకవి టి. యస్. ఇలియట్ వారి ఏప్రిల్ నెలని అవహేళన చేస్తాడు. ఒకప్పుడు వారికి ఏప్రిల్ అందాల బరిణె. నేటి ఋతువులను గురించి యే 'ఆరుద్ర' వంటి వాడో వ్రాస్తాడేమో అంటే వ్రాయడంలేదు. మా మిత్రులు శేషేంద్రశర్మగారుకూడా తలంచుకుంటే వ్రాయగలరు, ఈ ఋతుఘోషలో ఆ వాసనకూడా కొంచెం కొట్టింది.

'ఋతుఘోష' అనే పేరు మొట్టమొదట నాకు చిత్రంగా తోచింది. కావ్యం చదివిన తర్వాత ఆ పేరు పెట్టడం సముచితమే అనుకున్నాను. మీరు చదవండి; అతడా పేరెందుకు పెట్టినాడో తెలుస్తుంది. కాళిదాసాదులు ఋతువుల అందాన్నే చూచినారు. విశ్వనాథాదులూ అలాగే చేసినారు. ఒక ఋతువులలో యేమిటి, ప్రతిదానిలోనూ అందాన్ని భావించడమే కళకు పరమార్థమని వారి ఊహ. కావ్యప్రకాశములో చెప్పినలక్షణం యీ సిద్ధాంతాన్నే దృఢపరుస్తుంది. 'నియతికృత నియమ రహితాం । హ్లాదైకమయీ మనన్య పరతంత్రాం ।

నవరస రుచిరాం నిర్మితి। మాదధతీ భారతీ కవేర్జ యతి.' - ఏదో ఊరికే అన్నానుగానీ-ఒక కావ్య ప్రకాశకారుడేమిటి, ప్రతి ఆలంకారికుడూ అందాని కోసం అర్రులుజాచినాడు. కాని నేడు యీ మూల సిద్ధాంతాలకు ప్రతీప సిద్ధాంతాలు యితర దేశాలలో బాగా ప్రచారంలోకి వస్తున్నాయి. "The contemplation of the horrid or Sordid or disgusting by an Aritist, is the necessary and negative aspect of the impulse toward the pursuit of beauty. But, not all succeed edas did Dante in expressing the complete scale from negative to positive. The negative is the more importunate." (T. S. Eliot.) వికృతస్వరూపాలను భయంకరంగా తీర్చి దిద్దుతూ ఉన్నారు. ఆ వర్ణనలు కూడా సౌందర్యం లోనే అంతర్భూతాలవు ననుకుంటాను. ఏది ఎలాగున్నా కళయొక్క మూలసూత్రాలనే నేటి రచయితలూ విమర్శకులూ కదలించివేస్తున్నారు. ఆ తీరుతెన్నులు ఈ కావ్యంలోనూ కొన్ని వున్నాయి.

శర్మగారికి ప్రాచీన కవులందరిపైనను గొప్ప యభిమానం ఉన్నది. ప్రాచీన కవులనగా రసవాదు లన్నమాట. తిక్కన, పింగళి సూరన మొదలగు వారిపై వీరికి ప్రీతి ఎంతో చెప్పలేము. చాలచోట్ల నన్నయభట్టులను పుణికిపుచ్చుకున్నారు. భట్టారకులే తరువాతి ప్రబంధ కవిత్వానికి ఒరవడి. ప్రాచీను లలో గూడా శ్రీనాథునిపై యీతనికి రెండింత లభిమానమున్నట్లున్నది. సమాస పరికల్పన శ్రీనాథుని వలెనే విశంకటముగా చేయడానికి ప్రయత్నిస్తాడు. ఈ క్రింది పద్యం చూడండి.

సీ॥ ఘన ఘనా ఘన గజగ్రైవేయ ఘంటికా
టంకారములకు ఘంటాపథంబు
శక్రచాపోదగ్ర శార్దూలపాలనా
విభవోన్నతికి భూరి విపినసీమ
చటుల ఝుంఝూమరుచ్ఛతకోటి భేతాళ
లుంఠన క్రియలకు రుద్రభూమి
పటు తటిద్విలసన బ్రహ్మరాక్షస కరో
రాట్టహాసమున కహార్య బిలము

గగన భాగమ్ము ప్రావృషద్విగుణరోష
ఘటిత నటనోగ్రధాటీ విఘటిత ప్రకట
కుటిల ధూర్జటి ఘనజటా పటల నిటల
వికట భ్రుకుటీ కుటీర ముద్విగ్నమాయె

ఇందులో గీతపద్యంలో "ప్రకట" "భ్రుకుటి" అనేచోట ఛందస్సుకోసం ఛాందసులు కీచులాడ వచ్చు. "భ్రుకుటి" లోని రకారాన్ని తేల బలక డమూ కద్దు. ఒత్తిపలకడమూ కద్దు. తిక్కనగారు "వికట భ్రుకుటీ పటువృత్త నర్తన" అన్నారు. ఛందస్సు, వ్యాకరణము, సక్రమంగా తు. చ. పాటించి వ్రాసిన వారినే మహాకవులని లోకం గుర్తించడంలేదు. భట్టి మహావైయాకరణుడు. కాని మహాకవి కాడు. కాళిదాసులోనే పాణి నీయాన్ని ఉల్లంఘించిన ప్రయోగాలు చాలా ఉన్నాయి. మల్లినాథుడు "ఐంద్రాది" వ్యాకర ణాల సహాయంతో వానిని సమర్థించివాడు. కొన్ని చోట్ల "ఇతిచింత్యం" అని ముందుకుపోయిన ఘట్టాలూ ఉన్నాయి. నియమం పనికిరాదనికాదు నేను చెప్పడం. ఎక్కడో ఒక్కపొరపాటు జరిగితే

దానిని పెద్దచేయరాదంటాను. కావలసింది రసాను భూతి కానీ శాస్త్ర నిర్వాహము కాదు; దానికి క్షేత్రాలు వేఱు. రసదృష్టి లేనివారూ అసూయా పరులూ యిట్టిచిన్న నెరసులను పట్టుకొని గల్లంతు చేస్తారు. దానితో రసోపాసికి కలగే నష్టమేమీలేదు. వారి మనోమాలిన్యం బైటపడుతుంది, అంతే.

సమాసాలలోనే గాక సాధారణంగా వ్రాసి నప్పుడు గూడా అక్షరాలా శ్రీనాథుణ్ని సాక్షాత్క రింప జేసుకోవలెనని శర్మగారి ఆశ.

చెప్పిన విషయమేమీ లేకపోయినా, 'శైలి' అనే రసవాదంతో యేమో ఉన్నదనిపించడం శ్రీనా థుని వంతు.

> "సలిలంబు త్రిషవణస్నానతమంబౌనె
> అంభోజపత్రదీర్ఘాయతాక్షి"—

అంటాడు శ్రీనాథుడు. ఇందులో చెప్పిన విషయ మేమీ లేదు. కానీ పదాలతో పాఠకులను మోహింప జేస్తున్నాడు. ఈ గుణం శేషేంద్రశర్మలో నిండుగా కనపడుతుంది.

చూడండి. "లోబంబు ధ్వనించె. నాకసము గండూషించె బీరెండలన్" ఇక్కడి "గండూష" శబ్దము ఒక పెద్ద సార్వభౌమునివలె ఉంది; ఆ పాదములోని సౌందర్యాన్నంతా తానే పాలిస్తూ ఉన్నది. ఇట్టి రచనలు చూచినప్పుడు. "ఒక్క ప్రౌఢశబ్దం యెంతపని చేస్తుంది!" అని ఆశ్చర్యం కలుగకపోదు.

నన్నయగారి తర్వాత శయ్యాలాలిత్యాన్ని పెద్దనగారివలె సాధించినవారు లేరని నా వూహ. విజయనగర సాహిత్యములో ఒక్కొక్క రొక్కొక్క గుణమునకు పట్టాభిషిక్తులు "శిరీష పేశల సుధామయోక్తి''కి పెద్దనగారే సార్వభౌములు వారిని చక్కగా ఉపాసించిన చోటులుగూడ అక్కడక్కడ ''ఋతుఘోష''లో కన్పిస్తాయి.

ఈ కావ్యంలో ఎక్కడబట్టినా "మనోహర ధీర గంభీరశైలి'' కన్పిస్తుంది, రీతిని యింతగా సాధించిన వారు అరుదు. ఈ గుణములో ఇతడు హంపి క్షేత్రాన్ని వ్రాసిన కవికి యే చుట్టమో అవుతాడు. అసలు రీతికవిత్వమే ఆంధ్రుల ప్రత్యేకత. వ్రజ

భాషలో ''రీతికాల''మని కొన్ని శతాబ్దాలను విభ జిస్తారు. ఆ కవుల నిర్వహణ కొంత చక్కగానే ఉంటుంది. అదియైనా ఆంధ్రానికి తర్వాతనే. మళ యాళం లోనూ కొద్దిగా ఉన్నది. తమిళంలో రీతికవిత్వం లేదనే చెప్పవచ్చును. ''మధురకవి ఆళ్వారులు'' కొంత ప్రయత్నం చేసిరి. కాని ఆ భాషలో అది రక్తికిరాలేదు. హళగన్నడములో రీతి కవితలున్నవి పంపడాగుణమును బ్రహ్మాండ ముగా సాధించెను. శక్తికవి రన్నడుకూడా తీసి పోలేదు. హొసగన్నడములో రీతిని గొప్పగా సాధించిన వారులేరు. కుమారవ్యాసునిలో కూడా కన్పించదు. దీనికి కారణం, తరువాత వచ్చిన షట్పది వృత్తాల ప్రాబల్యం. వ్రజ భాష లో 'దోహా'లు చాలా చిన్నవి. కొంత పెద్ద వృత్త ములు వ్రాసిన రసఖాన్ మొదలైనవారు రీతిని చక్కగనే పోషించిరి. సంస్కృతముతో పొత్తు గలపనిది రీతి చక్కగా కుదరదేమో అని నా అను మానం. తమిళములో అందుకే వృద్ధికి రాలేదను కుంటాను. మళయాళ కన్నడములలో ఛందస్సు చిన్నదై పోయినది. ఏతావతా-సంస్కృతం తర్వాత

**రీతిని చక్కగా నిర్వహించే భాగ్యం ఆంధ్రభాషకే** దక్కిన దంటున్నాను.

పెద్దనగారు 'వేళల సుధామయోక్తులకు' పేరే గానీ, భావనూత్నతకు కాదు. భావనూత్నత కొంత వరకు రాయలలోను, రామకృష్ణునిలోను కనపడు తుంది. శర్మగారికి తెనాలి రామకృష్ణుడన్నా పక్షపాతమే. ఈ పద్యం చూడండి:

వర్షా గర్జ దమోఘ మేఘపటలీ వాఃపూర
ధారా సము
త్కర్షామర్షా నిపీడ్యమాన జనతా కంఠీర
వంబై, నభ
శ్శీర్షాంతఃపుర భోగ భాగ్య వనితాశ్లేష
ప్రభావార్ష దు
ర్ధర్షాగార బిడాలమై నడనె నౌరా కాలము
ద్వేలమై.

పద్యం దురుసుగా కొట్టవచ్చినట్లుంది. ఇక్కడ బిడాలాన్ని తీసుకునిరావడం రామకృష్ణునివంటి చూపు. అల్లే-ఆకాశంలోని చుక్కలు "తమశ్చికుర నికరమ్ములో సికత రీతిగ" నున్నవనుటయు:

వర్షర్తువును వర్ణిస్తూ, "ఆత్మవేదన శోక యాకారమై తోచి నేటిరేయి నన్ను కాటువేసె"- అంటాడు. ఇట్టిపోకడలనే Subjective Poetry అంటారు, మర్మవిదులు. 'విధురవాయు వీచిని' చూచి ఆకాశం "మేను విరిచినేమో" అనడం కూడా సామాన్యమైన భావంకాదు. గ్రీష్మర్తు విజృంభణాన్ని "దుర్జనశాసనా"నికి పోలుస్తాడు. ఆ పద్యం శ్రీనాధుని ధాటిలో నడచిన చక్కని రచన. రిక్షావాడూ, చాకలి, బండలను లాగే కూలివాడు, గుడ్డిదీపపు వెలుగులో కూర్చున్న ముసలమ్మా—"అణగారిన బాధితులంతా యీ రచనలో చోటుచేసుకున్నారు. రిక్షావానిపైన యింత పెద్దపద్యం మరెవ్వరూ చెప్పి ఉండరనుకుంటాను. (వర్షర్తు. 4. ప) ఈ పద్యమే నిజంగా వానికర్థమైతే, యీ సానుభూతికి వాడెంత సంతోషిస్తాడో!

శర్మగారు ఆస్తికులు. కాని అక్కడక్కడా సంశయవాదిగా మారుతారు. అది తాత్కాలికంగా కలిగిన పొరమాత్రమే. ఈ'బాధకులూ బాధితులూ' ఒకచోట దుర్భరదారిద్ర్యం మరొకచోట జీర్ణము

గానట్టి సంపదా-ఇదంతా ఏమిటి ? ఈ ప్రపంచం ఇలా ఉండడం ఏమిన్యాయం ? అని ఆశ్చర్యపోతాడు. ఈ సామాజిక పద్ధతి, మనం తయారు చేసుకున్నదే అని కవికి తోచదనుకుంటాను. దానికి కర్మ సిద్ధాంతముపై ఉన్న ప్రగాఢ విశ్వాసం కారణం. సూర్యుడ్ని బీదలకు మేలుచేయమని అతడు వేడుకొన్నప్పుడు మనకు జాలివేస్తుంది. ఆ అమాయకతకు నవ్వుకూడా వస్తుంది.

ఈ కావ్యంలో మూడు విధములైన భాష ఉన్నది. శరద్వర్ణన వ్యావహారిక భాషలో నడచింది. సంధులు విశకలితం చేయడంకూడా జరిగింది. కొన్ని రచనలు స్వచ్ఛమైన గ్రాంధికభాషలో సాగినాయి. మరియొకపద్ధతి యేమిటంటే వృత్తాలు వ్యావహారికంలో వ్రాయడం.

ఉదాహరణ:

"ఒక మల్లె విరిసింది ఊహాలో మురిసింది
యేయాస నీమీద యెంచుకొనెనో ?"

ఇట్లే సాగుతుంది పద్యం.

'హిమబిందు సుందరి', 'సుమ సముద్రము', 'కీటకయోగి', 'వల్లిక తపసి', 'అలరు గందము', అని యేమేమో క్రొత్తక్రొత్తగా చెపుతాడు. వ్యావహారికభాష కావ్యయోగ్యం కాదనేవాదంపై నాకు నమ్మకంలేదు. 'గురజాడ' పుట్టిన తర్వాత కూడా అలాభావించే దురదృష్టవంతు లెవరైనా ఉంటే, వారా పద్యాలు వదలివేసి తక్కినవి చదువు కోవచ్చు. "కాలపథమందొక యొంటెల బారువోలె" ఋతువులు పోతున్నాయన్నప్పుడు నా భావంలో ఒక్కసారి శ్రీశ్రీ మెరిసినాడు.

శర్మగారికి ప్రాచీన సాహిత్యంపై గౌరవం ఉంది, నవకవులపై సానుభూతిఉంది; ఆస్తికత ఉంది. సంశయమూఉంది, బీదలపై సానుభూతీ, వారు బాగుపడలేదేమనే అక్కసూ, కర్మవాదంపై విశ్వాసమూ-ఇన్ని భావాలమధ్య నలిగిన, నలుగుతూ ఉన్న ఆత్మ పెట్టేఘోష "ఋతుఘోష".

"మూస్తే నాకళ్ళు నిద్రిస్తున్న ఆపిల్ పళ్ళు, తెరిస్తే నాగుడ్లు వరివెన్ను కన్నవడ్లు; నేను గురక పెట్టినా విశ్వానికి నిద్రపట్టదు" (మండేసూ)

# కవిసమ్రాట్ విశ్వనాథసత్యనారాయణ:

(ఋతుఘోష పీఠికనుంచి)

ఈ కవి ఋతువుల తత్త్వము తెలిసి వ్రాసిన వాడు. (అనగా) కాలముయొక్క తత్త్వము తెలిసి వ్రాసినవాడు. కావ్యమునకు నుత్తమత్వము సంపాదించు లక్షణములలోనిది ప్రథమమైనది.

పూర్వ మహాకవులందరు ఋతువులయొక్క ప్రబోధము భోగసాధనము, వారియందలి నైగ నిగ్యమును వర్ణించినవారేగానీ పేదవారి యందలి వంచనను వర్ణించినవారుతేరు. ఈ కవియొక్క వైశిష్ట్యములో నీ వర్ణనకూడా నొకటి. ఇట్లు ఋతుతత్త్వము, ఋతుమహాలక్షణము, వానిప్రబోధము, వానిముద్ర, వాని ద్విధాభూతమైన విలసనము తెలిసివ్రాసిన ఈ కవియొక్క వ్రాత పరమోత్తమ జాతికి చెందియున్నది.

ఈయన కవిత్వమునందు పూర్వకవుల లక్షణములు మిక్కిలిగా కలవు. క్రొత్తదనమును కలదు.

కౌముదము వెలుగులు, హిమబిందు సుందరి మొదలైన గడుసుసమాసములు కలవు. ఇతనియందొక విలక్షణమైన భావనకలదు

ఇట్టి కవియొక్క రచనయందు కూర్పుయొక్క రమణీయత చూపించుట యనవసరము. అట్టి రమణీయత కితని గ్రంథము పండినపంటచేను. ఇట్టి రచన చేయగలవారీనాడు పట్టుమని పదిమంది యైనను లేరు. ఈయన చిరాయువై యొకమహాకావ్యనిర్మాత యగుగాక.

"మనం ఆయువు కోసం పీల్చే వాయువులో హాహాకారాలు పోసింది ఈయుగం, బలవంతాన చేతికిచ్చిన విషపాత్రిక ఈ జగం" (మండేసూ)

"రాళ్ళెన్ని ఉన్నా దూరాన్ని కొలిచే రాయి ఒక్కటే... మాటలెన్నిఉన్నా పొందిందీలేదు పోగొట్టుకున్నదీ లేదు ఈ వెలుగు చీకట్ల సంగమంలో అని చెప్పేమాట ఒక్కటే" (మండేసూ)

# ఋతు ఘోష

శ్రీ శేషశర్మా

(గైర్వాణీ త్రైమాసికీ పత్రికా, చిత్తూరు)

కాళిదాస రచితస్య ఋతుసంహారస్య పఠనేన ఉత్సుకితేన అనేన నవ్య భవ్యభావ పరీవాహం గుంఫిత మిదం ఆంధ్ర ఖండకావ్యం. ధనహీనానాం కర్మ కరాణాం అన్యేషాంచ అవస్థావిశేషాః రసికానాం విలాసాః ఇత్యేవమాదీని బహుధా అత్ర నిరూపితాః. అత్రకుత్రచిత్ కవితాశైలీ శైలాదవ తరన్నిర్ఝరఘర్ఘరారవా, అపరత్రచ మృద్వీకామృద్వీచ విలసంతీ కవేః సవ్యసాచితాం సూచయతి.—

"ఈ ప్రపంచంలోన ఎక్కడున్నా సరే ధ్రువములకు మధ్యవలె దూరమైనాసరే మనుషులంతా ఒక్కటే అందరి మనుషులంతా ఒక్కటే ఈదేశమననీండి ఆ దేశమననీండి కొండలల్లే మధ్య గోడ పెట్టగనీండి బాధలంతా ఒక్కటే అందరీ గాథలంతా ఒక్కటే" (పతులు)

## శ్రీ ఆచంట జానకిరామ్

ఒక చక్కని పుస్తకంచూస్తే ప్రాణం లేచి వస్తుంది. ఇక అందలి ఇతివృత్తమున్నూ అందంగా ఉంటే గ్రంథం మనోహరంగా ఉంటుంది. తప్ప కుండా ఇటువంటి మనోహరమైన గుణములు కలదే శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ "ఋతు ఘోష". పేరునుబట్టే చెప్పవచ్చు. ఇందు ప్రకృతి వర్ణన ప్రధానమైన అంశమని. కాళిదాసమహాకవి నుంచి నేటివరకూ ఇటువంటి ప్రకృతివర్ణన మన కవులను ఆకర్షించినది. కొందరు అన్నిఋతువులను క్రమంగా వర్ణించి ఆనందించారు. కొందరు ఆమని సొబగునూ శరద్రాతులు కలిగించిన. సౌందర్యో న్మత్తతనూ వర్ణించి ధన్యులైనారు. మొదటికోవకు చెందిన వారిలో అతినవీనులు శ్రీ శేషేంద్రశర్మ. వీరు తమ రచనకు 'ఘోష' అని పేరుపెట్టడం చాలా సమంజమనిపిస్తుంది. నాగపూర్ నుంచిపదేపదే ఢిల్లీ వెళ్ళడం తటస్థించినవారికి తెలుస్తుంది ఋతు వులు ఎలా ఘోషిస్తాయో. రైలులో వెడుతుంటే

మనందాకే అడవులు ఒక్కొక్క ఋతువులో ఎలా మారిపోతుంటాయో ఎటువంటివారైనా గమనించక తప్పదు. ఆ చెట్లే, ఆ లోయలే, ఆ వాగులే, ఆ బయళ్ళే ఒక్కొక్క ఋతువులో ఒక్కొక్క విశిష్టతను అలవరచుకొని "మా క్రొత్త అందాన్ని చూడండోయ్ !"అంటూ ఘోషిస్తాయి. ఇంతగా మారుతూ వచ్చే ఈ సౌందర్య సంపద ఎక్కడలేని ఆనందాన్ని, ఎన్నడూ కలుగని అపరిమితమైన ఉత్సాహాన్ని కలిగిస్తుంది. ఇటువంటి అనుభవాన్ని సంతరించుకున్నవారిని ఎంతగానో కదలిస్తుంది శ్రీ శేషేంద్ర ఈ రచన. ప్రబంధశైలి కొంతఉన్నా తమ అందమైన అనుభవాన్ని మనతో పంచుకొనే తీరులో ఒక నవ్యత ఉన్నది ఈ రచనలో అంతటా ద్రాక్షరసమేగాని నారికేళపాకమెక్కడా లేదు. అక్కడక్కడ దేవులపల్లి కృష్ణశాస్త్రి రచనా ఎక్కడో కొన్నిచోట్ల వేదుల సత్యనారాయణశాస్త్రి రచనా జ్ఞాపకం వచ్చినా శ్రీ శేషేంద్రశర్మ ఒకానొక విశిష్టమైన శైలిని అలవరుచుకున్నారనవచ్చును. సంస్కృత పదాలు, సమాసాలూ విరివిగానే వాడుతారు. కాని, అంత

మాత్రంచేత వారిభావం మనవంటి వారికి సుగ్రాహ్యం కాకపోదు. ఉదాహరణకు-ఈ పంలలో ఎంతటి గొప్పభావం ఇమిడిఉన్నదో:

ఆసల్ దీరునె దృష్టిచే, మహితగా
ఢాలి గనా యుక్తిచే
నా సంయోగ నిరంత వేదనము తే
యద్వైత సంసిద్ధికో
నైసర్గంబగు నే యగాధ కుహా
రాంత ః ప్రజ్వలానంద కీ
లా సంతర్పణకో శరీర మొక కా
రాగారమై తోచగన్

అలా వ్రాసేవారే ఇలాకూడా వ్రాయగలరు:

ఒక మల్లెవిరిసింది ఊహాలో మురిసింది
ఏ యాస నీ మీద యెంచుకొనెనో
ఒక గులాబీబాల చికిలి నవ్వొలికింది
ఏ యెలమి తరంగ మెగిరి పడెనో
ఒక జాజి పలపు నిట్టూర్పులు బరపింది
ఏ కోర్కె యెద నాక్రమించుకొనెనో

ఒక తీగె సంపంగి ఉప్పొంగిపోయింది
ఏ తలపు వెదుళ్ళ ఈల వినెనో

ఈ వర్ణన హిమవంతంలోనిది. ఒక్కొక్క ఋతువును గురించిన్నీ కొన్ని హృద్యములైన పద్యములున్నవి.

కాని, చిత్రము ప్రతి ఋతువర్ణన చివరా ఒక పద్యమో రెండు పద్యాలో బీదవారిని గురించి, అనాధులను గురించి, ఆకలి దప్పికలతో అలమటించే వారిని గురించీ జాలికరమైన, ఒక్కొక్కప్పుడు బాధాకరమైన వర్ణన ఉంటుంది. నా దృష్టిలో ప్రధానంగా ప్రకృతి రమ్యతను గురించిన ఈ కావ్యంలో అటువంటి ప్రస్తావన తెచ్చిపెట్టు కొన్నట్టు ఉంటుంది. ఆ విషయాలను గురించి వేరే రచనలు సాగించవచ్చు. తీరిక ఉండి, ఓపిక ఉంటే. కాని ఇక్కడ అవి పానకంలో పుడకలు లాగ అడ్డు తగులుతూండడమేగాక ఈ సంద ర్భంలో అటువంటి ప్రస్తావన చేస్తూన్నప్పుడు కవికి సహజంగా ఉండవలసిన నిజాయితీ కొంత కొరవడుతున్నట్టు తోస్తుంది. ఒకచోట ఈ విషాద

పరిస్థితుల వర్ణన ఎంతవరకు వెళ్ళినది అంటే, అద్భుతమైన శరత్కాలపు వెన్నెలను వర్ణిస్తూ చివర అంటారు కవి:

పండు వెన్నెల రాదేల పంతగించి
చితికిపోయిన దీనుల జీర్ణకుటికి,

పై కప్పులేని పూరిగుడిసెపై పండువెన్నెల విరియకుండా ఉంటుందా? కవిభావం ఆ దీన హృదయాలలో వెన్నెల లేదని.

ఋతుఘోషతో కలిపి కవి రచించిన మరి కొన్ని ఖండకావ్యాలూ ఉన్నాయి. ఈ గ్రంథంలో వీనిలో ''వలపు''ను గురించిన నాలుగు పద్యాలు చాలా రసవంతంగా ఉన్నాయి. ''నిరీక్ష'' కూడా బాగుంటుంది. ఇక్కడ ఒక సందర్భంలో ''కోవెల వంటి నా హృదయకుంజము'' అన్నారు కవి— చాలా బాగుంది.

ఇటువంటి రచన మన ఆరుద్రకు నచ్చలేదు. ఈ గ్రంథాన్ని గురించిన పరిచయంలో వ్రాసం టారు. ''ఆధునిక కవిత పాత పద్యాల చట్టాలలో

మేకు బందీ అయిపోవడం నా కిష్టంలేదు...శర్మ గారు తమశక్తి సామర్థ్యాలు వృథా చేస్తున్నారని చెప్పక తప్పదు'' అని. కాని కవి ఈనాటివాడైనా వెన్నెల కాళిదాసు అనుభవించిన వెన్నెలే. నిర్మలా కాశం పోతనామాత్యుడు చూచినదే పుష్పించిన లతాకుంజములు అప్పుడూ ఇప్పుడూ ఒకే గొప్ప సౌందర్యానుభూతిని కలిగిస్తాయి. మరి ఆ వెన్నెలనూ, ఆ ఆకాశాన్ని, ఆ పువ్వులనూ, మన సంప్రదాయ విరుద్ధమైన, మన తెలియమీరిన మాటలలోనే ఎందుకు వర్ణించాలి? కవి కొన్ని కొన్ని సందర్భాలలో తన మనోవీధిని అవతరించిన అందమైన బొమ్మలను తనకు కనుపించిన బొమ్మలను కనుపించినట్టుగా వర్ణించడంలో తప్పేమో నాకు తెలియలేదు. అర్థంకాని అలంకారాలతోనూ విపరీతమైన ఉత్ప్రేక్షలతోనూ మనలను విసిగించనంత వరకూ ధోరణి ఆపాతధోరణి ఐనంత మాత్రాన ముప్పేమీలేదు ఉదయిస్తూన్న చంద్రబింబాన్ని వర్ణిస్తూ "కుమ్ములో పెట్టిన టొమాటో పండు" అనే అనకర్కరలేదు నవీనతకోసం. "ప్రాక్సతీ మణి

నుదుటి సిందూర తిలకము" అనవచ్చు– అలాగ మన కవికి కనుపిస్తే.

నా ఉద్దేశంలో, నానాటికి పేలవమై పోతున్న మన తెలుగు కవితకు ఒక గొప్ప ఉదాత్తతను ప్రసాదించగల గుణాలున్నాయి ఈ "ఋతు ఘోష" కావ్యంలో. ఇది రచించిన కవి ధన్యుడు. కవితలో ఎన్ని చిన్నచిన్న లోపాలున్నా!

"కొందరికే తెలుసు జీవిత శక్ర చాపం వెన కున్న నగ్నత కానీ తప్పదెవరికీ ఆ రంగుల వలలో నిమగ్నత - ఏది ఎందుకు తారసిల్లుతుందో ఎవరూ చెప్పలేనిది బ్రతుకు; కారణాలకు ఏవో విదూర తీరాల్లో వెతుకు" (శేషజ్యో)

"తరు మూలమ్ముల పూలవాన కురిసెన్ తారాడె కూలంకషా తరుణీ స్వచ్ఛదుకూలచేలములలో తారళ్య సారళ్యముల్ ధరణిన్ నిండె శశాంక దీధితి నిశాధమ్మిల్ల మల్లీ వికస్వర కింజల్కములై ఒకా నొక శరద్వాతూల హేలాగతిన్" (ఋతుఘోష)

## ఋతుఘోష

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

నేడు ఆవిర్భవించుచున్న పలు తెరగుల కవితలలో గూడ మీ ప్రతిభ ఉజ్జ్వలముగా దీపించుచున్నది. మీరు నడచినను పరుగెత్తినను సొగసుగనే యున్నది. మీ నడకలో పరుగు పరుగులో నడక కానవగును

బుస బుస పొంగి పైయున్నది
దెస జను పాతాళ గంగ తెలి గసిమిసిమిన్
మిసమిస లాడెడు కన్నియ
యెసకము శేషేంద్ర సుకవయిత కవిత బళీ!

మీ ఋతుఘోష లోపల సమృద్ధముగా
నొక యాత్మ ఘోష సం
చారము చేయు చందము పసందగు;
తారస్వ కత్వ్య మీరినన్
మీరక యున్ననున్ దనదు మేలిమి కాంతిని
బాయదేని యె
వ్వారలు చూడ కుండ గలవారలు?
గుంటురి శేషరాట్కవీ!

# సౌహార్దము

గడియారం వేంకటశేషశాస్త్రి

"భావ ప్రౌఢములై సమాస ఘటనా ప్రాగల్భ్య సంధత్త గంగావేణీ ఘుమఘుంఘుమాయిత తరంగ స్నిగ్ధగంభీర ధారావేల్లత్ పటు సంస్కృతాంధ్ర సువచో రమ్యంబులై హృద్యతా శ్రీ వాసించు గదయ్య నీదు కవితల్ శేషేంద్ర శర్మాహ్వాయా"

*

"ఓహో ఏమి జరిగింది నీకౌగిట్లో నాకు! తొలి ఋషులు అగ్నికీలల్లో మంత్ర గ్రామాలు దర్శించినట్లు నీకౌగిట్లో ప్రేమ జ్యోతిని చూచాను" (శేషజ్యో)

"ఎక్కడికో నిశ్శబ్ద నిశీథ కుహరంలోకి పోయి ధ్యానం చేసుకుందామని ఉంది, ఎవ్వరూలేని దేవాలయానికి - చివరకి నా ఏకాంతానికి భంగం కలిగించే దేవుడు కూడా లేని దేవాలయానికి (నాదే–నాప్ర)

## చర్చలు లేఖలు

**—కీ॥శే॥ శకాంత**

సుప్రసిద్ధ కవి శేషేంద్రశర్మ కవుల్లో కవి, పండితుల్లో పండితుడు. పశ్చిమాన టి.యస్. ఇలియట్ తోను, తూర్పున జగన్నాథ పండిత రాయలుతోను వీరిని పోల్చవచ్చును.

శ్రీ రాజాధనరాజ్ గిర్ జీగారి పుత్రిక ప్రఖ్యాత ఆంగ్ల కవయిత్రి రాజకుమారి ఇందిరాదేవితో జరిగిన వీరి వివాహం ఉర్దూ తెలుగూ కవితల వివాహం. తద్వారా ఉర్దూ కవితా మధురిమతో వీరికి ఏర్పడిన సన్నిహిత అనుభవం తెలుగు కవితా రంగంలో వీరి స్థానం అద్వితీయం చేసింది.

1968లో మారిషస్, మడగాస్కర్, తూర్పు ఆఫ్రికా దేశాలు సందర్శించారు. 1970లో జర్మనీ, ఇంగ్లడు, ఫ్రాన్సు, ఇటలీ,గ్రీసు మొదలైన ఐరోపా దేశాలు పర్యటించారు.

"చేతులెత్తి గ్రీష్మానికి చెమటబొట్టు మొక్కింది గగనానికి ఇంద్రధనుసు కలగాని కోరింది" (మండేసూ)

## డా. యస్వీజోగారావు

ఆంధ్రశాఖాధ్యక్షుడు, P. G. Centre, గుంటూరు

రసిక వసంతులు శ్రీ శర్మగారికి
నమస్సుమనస్సులు, ఉభయకుశలోపరి

ఎన్నాళ్లకెన్నాళ్ళకు!

మనసు మథియించి పీయూష మానువాడ। నంగు
డగుటను అఖిల బుత్వంత రాత్మ। తానయై విశ్వ
రూపమ్ము దాల్చి వినుచు। అమర గానమ్ము నీకృతి
నాచికొంటి॥ఇది కవిత్వముకాదు సుమ్మిది మదీయ।
హృదయ మాకంద పాదపమ్మదుల శాఖ(। గూరు
చున్న కుతూహాల కూహు కుహుపు। కొసరి విసరిన
సాకూత కూజితమ్ము॥

ఒక మధురాధ రామృతమయోజ్జ్వల
రాసరహోరిరం సయున్

చర్చలు లేఖలు

ఒక మణిత ప్రతిధ్వని ముహుర్ముహు
రూర్జిత మోదముద్రయున్
ఒక మృదులస్మిత స్నపిత ముల్లమునూచిన
యోరచూపు తా
వక సకలోహ షట్పద సభన్ ఋతుఘోషగ
రూపు దాలిచెన్

"నాఆత్మ...ఒక కలలోకి ప్రయాణం చెయ్యాల
లని వెయ్యికలలు కంటుంది...ఏ కలలో జీవరాసు
లన్నీ రెక్కలమీద ఎగురుతుంటాయో తియ్యటి
అక్షరాలు వెదజల్లుతూ, ఏ కలలో రాలుతున్న ఆకు
కూడా నేలమీద పడేముందు ఒక గీతిక పడవలో
తేలుతూ రాలుతుందో'- (మండేసూ)

"ఇది వసంతం - సంవత్సరం కన్న మొదటి కల!
ఈకలలో నేను నాదేశపు శరీరంమీద నడుస్తున్నాను
ప్రభాత పూర్వ స్వప్నంలా" (నాదే-నా।ప)

# సాహిత్యకౌముది

శ్రీ డా. పాటిబండ మాధవశర్మ
యం. ఎ. (ఆనర్సు) పి. హెచ్. డి.

మాజీరీడరు, తెలుగుశాఖ, ఉస్మానియా
యూనివర్సిటీ, హైద్రాబాదు.

మిత్రులు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు జగమెఱిగిన బ్రాహ్మణులు. కవిగా, పండితుడుగా, వక్తగా, విమర్శకుడుగా ఆయన యావదాంధ్రమునకు ఇప్పటికే సుపరిచితులు.

ఋతుఘోష మున్నగు పద్యకృతులు, షోడశి, స్వర్ణహంస మున్నగు విమర్శ గ్రంథములు, వివిధ పత్రికలందు ప్రకటితములయిన పెక్కు గద్య పద్య రచనలు ఆయన ప్రతిభా వ్యుత్పత్తులకు సాక్ష్యములుగా ఇప్పటికే ఆంధ్ర భావుకలోకము నెదుట అవతరించి యున్నవి.

ఆంధ్ర సంస్కృతాంగ్ల భాషా సాహిత్యములందు ఆయన పాండిత్య మిట్టిదని యొకరు వేఱుగా చెప్పనక్కఱలేదు. ఆయన రచనలయందలి ప్రతి వాక్యము ఆ యంశమును ఉద్ఘోషించుచునే యుండును. వాల్మీకి రామాయణ మాయనకు కంఠస్థము. వ్యాస భారత మాయనకు కరతలా మలకము. కాళిదాసాది మహాకవుల కావ్యనాటకము లాయనకు చర్వితచర్వణములు. కావ్య, వ్యాకరణ, మంత్రశాస్త్రము లాయనకు ఘంటాపథములు.

ఆభిజాత్యము, ఐశ్వర్యము, అధికారము, రూపము, యౌవనము, పాండిత్యము, కీర్తి — వీనిలో ఏ యొక్కటి యేని మానవునకు మదమెక్కింప జాలు నందురు. ఇన్నియు నిండుగా నుండియు శ్రీ శర్మ గారి శీలమున వికారలేశమును ఆవిష్కరింపజాల కుండుట ఆయన జన్మాంతర సంస్కార మహాత్మ్యనకు నిదర్శనము.

ఈ గ్రంథమున సంకలితమైన రచనలు ఆ యా పత్రికలం దీవఱకే ప్రచురింపబడి యాంధ్ర సహృద యుల నలరించినవే. ఇట్టి గ్రంథమునకు పరిచయ

రూపమైన పీఠిక యనవసరము. ఐనను సంప్రదా యాభిమానమునచే కాబోలు శ్రీ శర్మగారు కొన్ని ఆముఖ వాక్యములు వ్రాయుడని నన్ను కోరిరి. వారి యభిమానమునకు పాత్రత గడించుటయే నాకు ఈ పీఠకా రచనమునకు అర్హత సమకూర్చి పెట్టినది.

అద్భుతమైన ప్రతిభ, అనితర సాధ్యమైన వ్యుత్పత్తి, అచంచలమైన యభియోగము. అసాధారణమైన యాత్మప్రత్యయము శ్రీ శర్మగారి సాహిత్య వ్యక్తికి మూలధారములు. శాస్త్రమునకు ఆయన దాస్యము చేయడు, దానిపై ప్రభుత్వము చేయజూచును. లోకుల యభిరుచిని ఆయన యను వర్తింపడు. తన రుచినిబట్టి దానిని సవరింపగోరును. సాహిత్య తత్వ వివేచనమున ఆయన శాస్త్రమును తిరస్కరింపడు. కాని స్వీయానుభవమును ప్రమాణీ కరించును. ఆ యనుభవమును శాస్త్రముగా తీర్చి లోకమునకు ప్రసాదింపవలెనని యువ్విలాట పడును.

ఒక క్రొత్త విషయమును తాను కనిపట్ట గలిగి నప్పుడు ఆయన యానందపరవశుడగును, ఆ

యానందము నొక వ్యాసమున పూరించి సాటి రసికులకు అందిచ్చును. ఆ పారవశ్యమున వెలువడిన వాక్యములు కొన్ని ప్రసిద్ధ కవి పండితులను ధిక్కరించినట్లు భాసించును. యథార్థమునకు ఈ ధిక్కారాభాసములు ఆత్మవిశ్వాసవ్యంజకములే కాని అహంకారాభి వ్యక్తులు కావు.

సాహిత్య ప్రస్థానమున ప్రసిద్ధములైన రీతి ధ్వని సిద్ధాంతములు శ్రీ శర్మగారికి ప్రత్యేకముగా అభిమాన పాత్రములు. ఈ సంపుటిలోని పెక్కు వాక్యములు రీతి సంకీర్తనములు. ఆయన సాహిత్య తత్త్వ దర్శనమునకు రీతియే కీలకము అనిపించును. ఏ వ్యాసము చూచినను రీతి చుట్టు చేయు చంక్రమణమే యనిపించును. ఆయన రమణీయములని యుదాహరించుకొనుచు పోయిన శతాధిక పద్య భాగములందు ఆయన నిరూపింప యత్నించిన రామణీయక హేతువులన్నియు వామనాచార్యుడు నిరూపించిన శబ్దార్థగుణములే యనవచ్చును. శ్రీ శర్మగారు చేసిన పద్య రచనా వైచిత్ర్య వివేచనమంతయు రీతి ప్రస్థానంతర్గతమే.

**చర్చలు లేఖలు**

శ్రీనాథావతార తత్త్వము అను వ్యాసమును చదువుచున్నప్పుడు పద సంఘటనా విశేషవశమున సిద్ధించు కావ్యపాకమునందు శ్రీనాథుని లౌల్య మెంతటిదో శ్రీ శర్మగారి లౌల్యము అంతకు మించినదే యని గుర్తింతుము. ఆ లౌల్యమువల్ల శ్రీ శర్మగారు శ్రీనాథుని పరాశక్తి యవతార మన్నను యాశ్చర్యపడము.

శ్రీనాథుడు పరాశక్తి యవతారమైనచో శ్రీ శర్మగారు శ్రీనాథుని యవతారము. శ్రీనాథుని యందు పుంజీభూతములైన భీమన, నన్నయ, తిక్కన్న, ఎఱ్ఱనల లక్షణములు శ్రీ శర్మగారి యందును మూర్తీభవించి యున్నవి. నిబిడ రమణీయ పదసంఘటనా ప్రావీణ్యము ఉభయులకు సమాన ధర్మము.

రెండవ కవిత్రయము అను వ్యాసమున శ్రీ శర్మగారు పూర్వ కవుల పరస్పర సాదృశ్యము లను నిరూపించుటకు చేసిన ప్రయత్నము అపూర్వము, జిజ్ఞాసువులు అప్రమత్తతతో అవధరింపదగిన చక్కని యనుశీలనము.

ప్రత్యేక ధ్వని కావ్యముగా తిక్కన్నగారి విరాట పర్వమును శ్రీ శర్మగారు పరిశీలించిన దృష్టి విలక్షణ మైనది. ఆనందవర్ధనుని ధ్వని సిద్ధాంతమునకు లక్ష్యా శ్రితమైన యథార్థ వ్యాఖ్యానముగా భావించదగినది ఆ వ్యాసము.

తిక్కన సోమయాజిని, పాల్కురికి సోమనాథుని ముఖాముఖి నిలిపి చేసిన తులనాత్మక పరిశీలన సరి క్రొత్త మార్గము త్రొక్కినది. పరిశీలన ఫలముగా "పాల్కురికి సోమనాథుడు పరశురావతారమైతే తిక్కన సోమయాజి శ్రీరామావతారం" అని చేసిన తీర్మానము పరమార్థ నిరూపకముగ నున్నది.

దాదాపు వేయి సంవత్సరములుగా మహాకవులు చేయుచు వచ్చిన కృషికి ఫలముగా తెలుగు పద్య రచన ఎట్లు పరిపక్వదశను పొందినదో శ్రీ శర్మ గారు చక్కగా నిరూపించినారు. పద్య రచనా శిల్ప రహస్యములను కొన్నింటిని స్పష్టముగా వివరించి నారు. సమగ్రమైన పద్య శిల్ప శాస్త్రమును నిర్మింపవలసిన ఆవశ్యకమును నొక్కి చెప్పినారు. ఆ కార్యమును శ్రీ శర్మగారే చేపట్టి నిర్వహించి

తెలుగువారికి మహోపకారము చేయుదురని కోరుదును.

ఈ సంపుటి యందలి వ్యాసములన్నియు శ్రీ శర్మగారి సాహిత్య రసానుభవములకు రూప కల్పనలు విలక్షణములు, స్వతంత్రములు, అనుభవైక సాక్షికములునైన కొన్ని యభిప్రాయములు విద్వాంసులకు సమ్మతములు కాకపోవచ్చును. ఐనను శ్రీ శర్మగారితో సర్వాత్మనా హృదయ సంవాదము పొందగల వారికి అట్టి యభిప్రాయములు ఆగమ రహస్యములు కాగలవు.

వ్యావహారిక పదస్వరూపములు దొరలిన పట్ల దప్ప అన్యత్ర వీరి శైలి ఉదాహృత పద్యభాగముల శైలితో స్పర్ధించునంత ప్రౌఢముగా నున్నది.

ఆంధ్ర సాహిత్యము నందలి యద్భుత చమత్కారములను ఆస్వాదింప గోరువారు ఈ సంపుటి యందలి వ్యాసములను మరల మరల పఠించి యానందింప గలరు. ప్రతిభైక దృష్టితో శ్రీ శర్మగారు దర్శించి ప్రదర్శించిన సౌందర్య లక్షణములను ఊతగాగొని యక్షయమైన ఆంధ్ర కవితా సౌందర్యమును అనుభవించి తరించగలరు.

# స్వర్ణహంస

**శిరోమణి శ్రీసన్నిధానము సూర్యనారాయణశాస్త్రి**
పి. ఓ యల్.

ఈ స్వర్ణహంస గ్రంథకర్తలు మన్మిత్రులు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు యోగమంత్ర వేదాంత సాహిత్య శాస్త్రములందు నిష్ణాతులు. సంస్కృతాంధ్ర కవితాదక్షులు. ఇట్టి పాండిత్యము నార్జించినవారు నూటకోకోటికో యొక్కరుందురు.

ఈ గ్రంథము భట్టహర్ష నైషధ కావ్యమును గూర్చి వ్రాయబడిన విమర్శగ్రంథము. ఈ విమర్శ చాల నగాధముగా నున్నది. ఇది P. H. D డిగ్రీ కొరకు వ్రాయబడిన విమర్శ వ్యాసము (Thesis) వలె నున్నది

వీరివిమర్శలో నలుడు జీవాత్మ; భీముడు పరమాత్మ లేక నిర్గుణ బ్రహ్మము; దమయంతి శ్రీ మహా త్రిపురసుందరి. హంస నైషధమునందు మొదటి మూడు సర్గలలో క్రమముగా అజపా మంత్రాధి

దేవతగా, జీవాత్మగా, పరమాత్మగా వర్ణింపబడినది. శాస్త్రీయములగు నుపనిషత్తులతో నీ విషయమును సమర్థించి యున్నారు. వీరి యీ సిద్ధాంతములను గాదనుటకు సాధ్యముగాదు.

శ్రీహర్షుఁడు "గ్రంథ గ్రంథి రిహ క్వచి త్క్వచి దపి న్యాసి ప్రయత్నాన్మయా" అని చెప్పుకొనెను. ఈ గ్రంథ గ్రంథులు యోగమంత్ర వేదాంతముల సంపుటియే. ఈ గ్రంథులను గొన్నింటిని ననఁగాఁ జాల స్వల్పముగా మల్లినాథుఁడు భేదించెను. శ్రీ శర్మగారు గ్రంథమున నున్న యెల్ల గ్రంథులను భేదించి లోకమునకు వెల్లడించినారు. దీనికిఁబాండిత్యము ప్రతిభయు సమానముగాఁగావల యును. శర్మగారికివి రెండును సమపరిమాణములో నుండుటచే భేదింపఁగలిగిరి. ఒకచోట మాత్రము(73 పుటలో) ఒక గ్రంధిని భేదించుటకు చాల శ్రమించియు విఫల మనోరథులమైతిమని ఋజు మార్గమున విచారము వ్యక్తము చేసిరి. దీనినిఁబట్టి వీరి విమర్శయంతయు మసిపూసి మారేడు నే రేడు చేసినట్లు గాక ఋజు మార్గమున నడచినట్లు వ్యక్తమగు చున్నదిగదా?

శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

హైద్రాబాదు.

విద్యత్కవయే శ్రీమతే శేషేంద్ర శర్మణే వితీర్యంతే భూయాంసి నమాంసి.

మన్యే భవంత స్సర్వేపి కుశలినః. ఆంధ్రప్రభాయాం ధ్వని ప్రశస్తి ప్రఖ్యాపినం భవతాం లేఖం దృష్ట్వా మహానంద భరిత స్సంజాతోహం.

బహోః కాలాత్ సిద్ధం న స్సమీహితమితి భృశం సంతుష్యామి భవత్సరస కవితాను రసితం లేఖం విలోక్య. ఆనంద తుందిలాంతః కరణోఽహ మర్పయామి కావ్య సుమాంజలిం భవచ్చరణ నలినయోః, స్వీకృత్యమాం ధన్యం కుర్వంత్వను యాచే-

అతి భాసుర వాక్చమత్కృతిం
రసభావై స్సమలంకృతాం తథా

మృదు చిత్ర విలాస విస్ఫురత్
పద విన్యాస సుశోభినీం కవే!-
భవదీయ కరార్పితాం స్పృశన్
కవితా ప్రౌఢ నితంబినీం దృశా
సకలేంద్రియ తృప్తి మధ్యగాం
హృదయం మేఽవ్యహరత్ ధ్రువంహిసా-
అధునాహ మితీహ భావయే
సులభం త్వ చ్చరణం కదాను మే
నమ ఏవ కృతజ్ఞతాన్వితం
కవి శేషేంద్ర సమర్పయామితే-
నిష్ణాత శ్శబ్ద తంత్రే నిరుపమ ధిషణః
కోమలే కావ్యమార్గే
నిస్సీమో రాజ్య తంత్రే నిరుప హతగతి
ర్దుర్గమే తత్త్వమార్గే
ప్రాక్ ప్రత్యగ్గీ స్సముద్ర ప్రథిత
మణి గణాకర్ష ణేయం సదీష్టః
శ్రీమచ్ఛేషేంద్ర శర్మా జగతి
విజయతే మండనం పండితానాం-

# స్వర్ణహంస

శ్రీ వావిలాల వేంకటేశ్వరశాస్త్రి

శ్రీమద్భ్యో భవద్భ్యః దత్వాశీంషి రచయామి కించిత్ పత్రంగైర్వాణ్యాం వాణ్యాం రచితం భవత్ ప్రేషితంపత్ర మద్రాక్షం. అమందానంద మవాపంచ అసాధారణయా భవదీయ మేధా సంపత్త్యా మోముహ్యమానోఽహం శీఘ్రమేవ భవద్దర్శనా కాంక్షీ భవామి——

త్రిపుర సుందరి దమయంతీతి భవద్భిః రచితో వ్యాసః అద్యత్వే ఆంధ్రప్రభాయాం ప్రకటీకృతః మయా దృష్టః, అతీవ సంతుష్ట స్థానమితికి ముచ్యతే; భవద్భిః ప్రకటీకృతేషు నైషధీయ వ్యాసేషు సాక్షి ప్రాయం మదీయం వ్యాసం కంచిత్ ఆంధ్రప్రభా ముఖేన ప్రకటీకర్తుం కృత నిశ్చయోఽస్మి సంతోష వ్యంజకాః మదీయ భావాః తత్రైవ పత్రికాయాం ద్రష్టవ్యా ఇత్యభ్యర్థయే;

గత రవివాసరే ప్రచురితో వ్యాసః అతీవ హృద యంగమో భూత్. పండితలోక స్సర్వోపి సంతుష్య తీతి మన్యే. భగవన్ సర్వదా తవపతాదృశీం మేధా సంపదం దద్యాదితి భగవంతం నౌమి.

భవదీయ వ్యాసేషు మహాన్ సుగుణో వర్తతే. సప్రమాణం విషయ నిరూపణం కృతం. అనేక ప్రామాణిక గ్రంథాః దృష్టాంతీ కృతాః. అద్వైత శాస్త్రాణిను గుణ్యేన ఆగమ శాస్త్ర సమన్వయం కృతః, ఏష ఏవ విషయః మత్రచితే వ్యాసే విపులీ క్రియతే. మల్లినాథ సూరిభిః అచుంబితోర్థః భవద్భిః ప్రకటీకృతః. తత్ మహాత్ సంతోషస్థానం. 'ఆపరితో షాత్ విదుషాం నసాధుమన్యే' ఇతి కాళిదాసోక్త రీత్యా పండిత పరితోషః భవద్వ్యాసేషు సంవృత్త ఇతి సఫలీకృతా తే వ్యాస రచనా ఇతి తర్కయామి.

ప్రాచీనాధునాతన మార్గద్వయ సమ్మేళనేన విలక్షణోమార్గః సారస్వత సీమ్ని భవద్భిః ప్రదర్శితః, భవాదృశాః సంస్కార జీవినో విరళతయా లోకే వర్తంత ఇత్యుక్తిః న సాహాసికీ భవతి.

మమ అయ మభిప్రాయః న స్తుతిపరః కింతు యథార్థ పర ఇతి విశ్వసంతు భవతః.

**శ్రీ విశ్వనాథశర్మా, ఆంధ్రప్రాచ్యభాషా**
**కళాశాలాధ్యక్షః, హైదరాబాద్—**

పరోపకారైక పరాయణం త్వాం
అధీత శాస్త్రాది సమస్త విద్యం
శేషోపమం శేవధి మాశ్రితానాం
శేషేంద్ర శర్మాణ మహం నతోస్మి

**శ్రీ కలచవీడు శ్రీనివాసాచార్యః, అనంతపురం**

**మహోదయ!** సాదరం గృహ్యతామిదం, నస్తుతి
పరం, పరంతు యథార్థకథనమ్—

**శ్రీ** మద్గుంటూరు శేషేంద్రశర్మా నల్పార్థ సార్థ
విత్ వక్రోక్తి భూషణః కావ్య సామ్రాజ్యాధ్యక్ష
శేఖరః—

వర్ధతామార్ష కావ్యార్థ సౌభాగ్యోద్ధార దీక్షితః
కవితాభాసరాద్ధాంత నిరాసన కృతే క్షమః—
రసభావ మర్మవేత్తా పూజ్యస్త్వం సత్యవేది సంఘస్య
సర్వదాతస్య హృదయే వర్తతే భావతః పదమ్—
**హితంచ** పథ్యం వచనం భవద్భ్యః
కాంక్షామహే సత్కవి తల్లజ! స్ఫురత్
భవత్ సువర్ణ ప్రతిపాదనక్షమా
సులేఖినీ గ్రంథ శతాయ కల్పతాం—



షోడశి ఆవిష్కరణ సభ (1965) హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఆవుల సాంబశివరావు,
శ్రీ విద్యామంత్రి రాఘవులు శ్రీ బి.కె. రావు I.A.S. శ్రీ దివాకర్ల వేంకటావధాని,
శ్రీ శేషేంద్రశర్మ

లయాలనూ శంకరులు ప్రచారంలోకి తెచ్చి వుంటా
రని వూహా చేసినారు. అందుకు నా కభ్యంతరం
లేదు. శంకరులు ప్రచారంలోకి తెచ్చినప్పటికీ,
ఆ మూర్తి కల్పనకు మూల భూతాలు శిల్పశాస్త్రా
లనీ, కనుక తత్కల్పనా గౌరవం సనాతన శిల్పర్షు
లకు చెందుతుందనీ నా అభిప్రాయం.

(శేషేంద్రశర్మగారు హరిహరనాథమూర్తి శిలా
విగ్రహాన్ని 1970లో పారిస్ నగరంలో 'మ్యూజీ
గిమే'లో చూచారు. ఆ శిలావిగ్రహాన్ని కంబో
డియా నించి తెచ్చారని ఆమ్యూజియం డైరెక్టరు.
శ్రీ శర్మగారికి చెప్పింది. 1976లో కర్ణాట దేశంలో
ఉన్న హరిహర్ అనే నగరాన్ని ఆ నగరంలోఉన్న
ప్రాచీన హరిహరనాథ దేవాలయాన్ని దర్శించారు.

తిరువాంకూరులో ఉన్న 'పద్మనాభస్వామివారి
దేవాలయంలో సంగీత మంటప స్తంభంమీద కూడా
వారు 1970 లో హరిహరనాథమూర్తి శిల్పాన్ని
చూచారు.)

* * *

# నాలుగో ప్రకరణం

## నా అభిమాన గ్రంథం: నరుడు నక్షత్రాలు

శ్రీ దేవరకొండ చిన్నకృష్ణశర్మ
(సౌ: సారస్వత మాసపత్రిక, విజయవాడ)

శ్రీ శేషేంద్రశర్మగారి ఈ గ్రంథం వారప్పుడప్పుడూ వ్రాసిన వ్యాసాల సంపుటి. ఈ వ్యాసాలు శ్రీ శర్మగారి బహుముఖ విజ్ఞానానికి నిదర్శనాలు. ఈ వ్యాసావళిలో మొదటిది 'నరుడూ నక్షత్రాలు' అనేది. గ్రంథానికి ఈ పేరే ఉంచారు శ్రీ శర్మగారు. ఇందులోవరుసగా నరుడూ నక్షత్రాలు, విజ్ఞానానికి అవరోధం, విజ్ఞానంలో ఊహాపాత్ర, ఉత్తమ సాహిత్యం ఉదాత్త మనస్తత్వ సమున్మీలనమే, జడ పదార్థం పరిణామ ఫలితమే, అందచందాల తెలుగు పద్యం, తెలుగుపద్యం అజరామరం, పద్యమూ ఆధునిక వస్తువూ, ఏదిఉత్తమసాహిత్యం, ప్రాక్ప్రతీచీ భూపతులు, హరిహరనాథుడు తిక్కన

ఊహకాదు, శ్రీనాథుని జన్మస్థానం నెల్లూరు, కర్ణాటాంధ్ర సాహిత్యసేతువు. గాథాసప్తశతి అనే వ్యాసాలున్నాయి రచయిత పీఠికలో అన్నట్లు ఈ గ్రంథంలోని ప్రతివ్యాసమూ నిరంతర విజ్ఞాన సాగర మధన ఫలితంగానే కనిపిస్తుంది నవ్యతాత్త్వ లోకనం నవజీవనాన్ని ప్రసాదిస్తుందంటారు. శ్రీ శర్మగారు, అవి వారు అనుభవంతో అన్నదేకాని ఎవరో చెప్పినదాన్ని పురస్కరించుకొని అన్నది కాదని వ్యాసం సమగ్రంగా చదువగా తోస్తుంది. ఇదేవిధంగా ప్రతివ్యాసంలోనూ రచయిత సత్యజిజ్ఞాస పరిస్ఫుటంగా గోచరిస్తుంది. విజ్ఞానానికి అవరోధం అనే వ్యాసంలో వీరు, "ఒకవేళ స్త్రీ స్థానం బలవత్తరం అయి 'స్త్రీకే విజ్ఞానాభివృద్ధి కావాలి మగవాడు మోహకారణం వాడిని కన్నెత్తిచూడ గూడదు. చూస్తే సంసారసాగరంలో పడతాము. అందుచేత మగవాణ్ణి నిందించాలి త్యజించాలి' అనే ఒకధోరణి బయలుదేరితే - అప్పుడెట్లా ఉంటుంది?" అని ప్రశ్నిస్తారు. నిజమే, ఎలాఉంటుంది? సత్య రాజా పూర్వదేశ యాత్రల్లో ఆడమళయాళాన్ని వీరేశలింగంగారు చిత్రించినట్టే ఉంటుంది. "భూగో

ళానికి రంధ్రం ఎందుకు వెయ్యగూడదు - అది సింగపూర్‌లో ప్రారంభిస్తే దక్షిణ అమెరికాలోని ఈక్వెడార్ ప్రదేశంలో తేలుతుందిగదా ? అందువల్ల సింగపూర్ నుంచి ఈక్వెడారుకు ఇప్పటిలాగా 1250 మైళ్ళు ప్రయాణం చేసేపని ఉండదు. 4500 మైళ్ళు పయనించటం తగ్గుతుంది. అనుకొన్నారట శ్రీ శర్మగారు. అనుకొన్నది హిందూ పత్రికకు వ్రాసి పంపారటకూడాను. కానీ అది ప్రకటితం కాలేదుగానీ, అమెరికాలో కొన్ని మిలియన్ల పెట్టుబడితో భూగోళానికి రంధ్రం త్రవ్వడం ప్రారంభించినట్టు ఒక వార్త ప్రకటితమయిందట ! ఇదంతా చదివితే 'హంసస్య పుణ్యైర్యశః' అనే ఆర్యోక్తి ఎంతో అనుభవం కలవారు చెప్పిందే సుమా, అనుకోకతప్పదు. ఈ విధంగా శ్రీ శర్మగారు చాలా విచిత్రంగా ఊహిస్తుంటే వారు ఊహించినవన్నీ క్రమక్రమంగా శాస్త్రజ్ఞులైనవారికందరికీ ఆలోచించదగినట్లుగా తోస్తున్నవని ఈ వ్యాసాల వల్ల విశదపడుతున్నది. వీరు ఒక సాహిత్య విషయమేకాదు, చారిత్రకాంశమేకాదు. విజ్ఞానశాస్త్ర మర్మమేకాదు; సర్వశాస్త్ర విష

యాల మీదా ఆలోచనలు చేస్తున్నారు. ఆ చేస్తు న్నవి ఆయా శాస్త్రాలలో నిష్ణాతలయినవారి అవశ్యా జ్ఞేయాలుగా ఉండడం ఒక విశేషం.

ఋతు ఘోషలో ఉదాహరించినట్టు వీరు ఛంద స్సులో వ్యాకరణంలో క్రొత్త సౌలభ్యం తేవాలని ప్రయత్నిస్తున్నారు. అందచందాల తెలుగు పద్యం అనే వ్యాసంలో వీరు ప్రశ్నిస్తున్నారు.

"ఓ నవలా మనోజ! సుమనోహర వాఙ్మయ భోజ!" అంటామనుకోండి నవలా మనోజ అని ఎందుచేత కలపకూడదు ? శ్రవణపేయంగా పదాలు ఐక్యమవుతున్నాయి గదా – 'నో' అనే అక్షరం ఇక్కడ ఎట్లా వచ్చినా అందులో ఓకారం ఉంది గదా! ఎందుచేత ఆద్యమైన 'ఓ'కు 'నో'కు యతి మైత్రి పాటించగూడదు? దాసోహం అనే ఉదాహ రణలో గూఢ సర్వమైత్రి ఎట్లాగూ ఒప్పుకున్నారు గదా మరొక అడుగు మాత్రమే ముందుకు వెళ్ల మంటాను–అంతే.

ఇదేవిధంగా అఖండయతీ. 'త' దల యతిమైత్రీ, 'ంట'కు 'ంఠ'కు త, థ లకూ, ద, ధ లకూ ప్రాస

మైత్రీ అంగీకరించదగ్గవే అని వీరు సూచిస్తున్నారు.

ఏలూరులో భావరాజుగారు ఇరవై సంవత్సరాల క్రిందటే ఇంతకంటె ఇంకా దూరం వెళ్ళి ఉత్పల మాలకూ, చంపకమాలకూ నడకలలో మొదటి ఒకటీ రెండు అక్షరాల్లో మాత్రమే వ్యత్యాసం ఉందిగాబట్టి రెంటినీ కలపవచ్చుననీ యతిప్రాసలే పాటించనక్కరలేదనీ చెప్పి ఆ విధంగా పద్యాలు వ్రాశారు. అల్లాగే మత్తేభ, శార్దూలాల్ని కలిపి వేశారు అయినా ఆ ప్రక్రియ వ్యాప్తం కాలేదు. కొందరకు ఇలాంటివి అసమ్మతాలే; మరి అయితేనేం? ఇవి అన్నీ ఎప్పటికైనా విస్తరించి ఛందోవ్యాకర ణాలలో పెద్దమార్పులు రావచ్చు. అయినా నన్న యాదుల రచనా రీతికి ప్రాముఖ్యం ఏమాత్రం తగ్గదు. లోకోభిన్నరుచిః అన్నట్టు ఒకొక్కరు ఒకొక్క క్రొత్తదారిని పోతూ ఉంటారు. అలా వెళ్ళేవారు అత్యంత ప్రజ్ఞాసమన్వితులయితే ఆ క్రొత్తదారులు కొన్నాళ్ళకు ప్రాతదారులుగా రుపొందుతాయి. ఏ దారి అయినా సాహిత్య పర మార్థానికి చేర్చేదయితే చాలు.

మొత్తంమీద ఈ వ్యాసాలన్నీ సాహిత్య ప్రియుల్లో విద్యార్థికుల్లో, క్రొత్త ఆలోచనలు రేకెత్తించేవే. అందరూ చదవదగ్గవే. ఇలాంటి వ్యాసాలు వ్రాయగల మేధావులు ఏ కాలంలో ఏ దేశంలో ఏ భాషలో అయినా అరుదుగా కనిపిస్తారు. శ్రీ శర్మగారు ఇటువంటి మేధావులు కావడం ఆంధ్రులకు గర్వకారణం అనడం అతిశయోక్తి కాదు.

"ఎంత ప్రయత్నించినా ఒక్క ఆవులింత కూడా రాత్రిని ఆహ్వానించలేదు. ఒకటి రెండు పేజీలు ద్రాక్షోపనిషత్తు పఠించి శయ్యతో ఏ తర్కమూ పెట్టుకోకుండా నా అవయవాల్ని దానికి స్వాధీనం చేశాను..." (నాదే-నాప్ర)

"చంద్రుడు పరచిన వెండి తువాలు మీద పడుకున్నా ఏ తార ఏ రహస్యం చెపుతుందో విందామని" (మండేసూ)

"వేళ్ళు కాళ్లయి నడిచే చెట్టు మనిషి; చెట్టుగా ఉంటే ఏడాదికొక వసంతమన్నా దక్కేది,మనిషినై అన్ని వసంతాలూ కోల్పోయాను" (నాదే-నాప్ర)

# నరుడు-నక్షత్రాలు

—శ్రీ జగన్నాథ్

అప్పుడప్పుడు ఆంధ్రప్రభ పత్రికల్లో ప్రచురించ బడిన వాటిల్లో 14 వ్యాసాలు సేకరించి ఈ పుస్తకం అచ్చొత్తించారు.

కాలక్షేపానికి, క్షణిక వినోదానికి వ్రాసినవ్యాసాలు కావివి. తొలిసారి దైనిక పత్రికలో ప్రచురించబడి నందువల్ల పుస్తకానికి విలువ ఏ మాత్రమూ తగ్గదు. నిజానికి ఎక్కువయింది. ఎంచేతంటే యిందు లోని ప్రతివ్యాసమూ ఎంతో ఆలోచించి వ్రాసినది. చదివి ఎంతో ఆలోచించ దగినది. ఏదో ఒక కొత్త విషయమో లేకపోతే ఒక క్రొత్తదృక్పదమో ప్రదర్శిస్తుంది. ప్రతివ్యాసమూ పదేపదే చదువ తగి నది. ఎంత చదువుకున్న వాడికయినా ఏదో ఒక వ్యాసం కొన్ని కొత్త సంగతులను బోధిస్తుంది. సారస్వతమంటేనూ సంస్కృతి అంటేనూ అభిరుచి

వున్న వాళ్ళందరికికూడా తరుచు పేజీలు తిరుగవేసి ఏదో ఒక విషయాన్ని గురించి నిష్కర్ష చేసుకునేందుకు అవసరమయిన వాంశాలుగల వ్యాసాలు. అంచేత ఈ వ్యాసాలన్నీ పుస్తకరూపంలో వుండటం చాలా ఉపయోగకరం.

చదువరులందరూ శర్మగారి వాదనలతో ఏకీభవించకపోవచ్చు. వారి పరిశోధనా ప్రతిపాదనలని ప్రతిపక్షం చెయ్యవచ్చు. కాని ఎంత వ్యతిరేకించే వ్యక్తిఅయినా వ్యాసంలోని వాదన పక్షపాతమయినదనిగాని, అనాలోచితమయినదనిగాని అనడానికి సావకాశంలేదు. నా మట్టుకునేను, "ఉత్తమ సాహిత్యం, ఉదాత్త మనస్తత్వసమున్మీలనమే" అనే వ్యాసంలో ఆయన ప్రతిపాదించిన అభిప్రాయాలతో ఏకీభవించలేను. ''ఒకగ్రముక్కలో చెప్పాలంటే సాహిత్యానికి వస్తువు మానవమనస్సు." (పుట 40) అన్నారు, ఈ విషయం ఎప్పుడయినా ఆయనతో చర్చించే భాగ్యం నాకు లభిస్తుందని ఆశిస్తున్నాను.

అట్లాగే యింకెవరయినా, "శ్రీనాధుని జన్మ

స్థానం నెల్లూరే" అనే వ్యాసంలోని వాదనలని ఒప్పుకోక పోవచ్చు. కాని యిలాటి అభిప్రాయ భేదాలు. చర్చలూ, తర్కాలూ సమర్థులయిన వ్యక్తులమధ్య ఏర్పడడమే, విజ్ఞాన పురోభివృద్ధికి తోడ్పడే మార్గం.

అసలు శర్మగారే, "ప్లాటో" సిద్ధాంతాన్ని అంగీకరించలేనంటున్నారు. (పుట 43) "సాహిత్యం వేదాంతంకంటె ఒక మెట్టు తక్కువ. అనే ప్లాటో వాక్యాన్నికూడా నేను అంగీకరించను.''—

"నరుడు, నక్షత్రాలు" అన్న వ్యాసమూ, "జడ పదార్థం పరిణామ ఫలితమే," అన్న వ్యాసమూ, ఒకక్లిష్ట కార్యాన్ని చక్కగా సాధించాయి. ఆధునిక విజ్ఞాన స్వరూపాన్ని అందరికీ అర్థమయే తెలుగు పారిభాషిక పదాలతో వ్రాయబడ్డాయి. ఈ విషయాలని గురించి యింగ్లీషు మాటలు వాడకుండా ఎట్లా చెప్పాలో అనేవి ఈ రోజున పాఠ్య గ్రంథాలు వ్రాసే వారికే సమస్య అయిపోయింది. తెలుగు భాషలో పాఠ్య గ్రంథాలని వ్రాసే రచయితలూ ఆ రచయితలను నియమించే అధికార

వర్గమూ ఈ రెండూ వ్యాసాలు చదువుతే, బడి పిల్లలు బ్రతికిపోతారు.

ఈ వ్యాసాలన్నీ అట్లాటివే—కాని వీటన్నిటిలోకి మణిపూస "హరి హరనాథు"డిని గురించి వ్రాసిన వ్యాసం. యిందులో అనేకమయిన క్రొత్త విషయాలు ఆధార పూర్వకంగా వివరించారు. వేదాంత దృష్ట్యా చూసినా, విజ్ఞాన దృష్ట్యా పరిశీలించినా, కవిత్వరసికతతో చదివినా యీ వ్యాసం ఎంతో తృప్తిగా వుంటుంది.

తెలుగు భాషలో వ్యాసరచన చాలా తక్కువ. అందులోనూ యింతటి నిర్దుష్టమయిన ప్రతిభావంతమయిన వ్యాసాలు యింతవరకూ పుస్తక రూపంలో వచ్చినట్లైలేవు.

"రాత్రి నేను కనే కలలు దినాల మీద కట్టే వంతెనలు; నేను పాట కాలేక పోయిన స్వరాన్ని; నాభాష తన నిండా బాధలు నింపుకుంది, నేను అధరాలమీద మౌనం విధించుకున్న పర్వతశ్రేణిని" (మండేసూ)

# నరుడు-నక్షత్రాలు

—శివప్రసాద్

"ఋతు ఘోష" కావ్యం ద్వారా ఆంధ్రలో కవుల ప్రశంసలు విస్తృతంగా అందుకున్న శ్రీ శేషేంద్ర శర్మగారు వివిధ సందర్భాలలో ప్రచురించిన వ్యాసాలే ఈ గ్రంథ రూపంలో అవతరించడం జరిగింది. పేరును బట్టి ఇదేదో "సైన్సు" సంబంధం - అనుకోవచ్చు. కాని, మూడు వంతులు సాహిత్య వ్యాసాలే ఉన్నాయి. అందుకనే నామం మరోరకంగా పెడితే బాగుండేది. శ్రీ శర్మగారి కలం చాలా భావాత్మకమైన పరిధులలోకి పాఠకులను తీసికొని వెళ్ళ గలుగుతుంది. సృష్టి సౌందర్యాన్ని, చిన్న అల్పాంశాలలో మాత్రం ఎందుకు చూడలేమని వారు వాదించే విధానం 'culture and nature' అన్న వ్యాసం గుర్తుకు తెస్తుంది. వీరి కావ్యశైలివల్ల శాస్త్రీయాంశాలు కూడా కవి

త్వంగానే మారిపోవడం అద్భుతమైన అంశం. ఇందులో తెలుగు పద్యం యొక్క శాశ్వతత్వాన్ని వర్ణించే వ్యాసమూ, ఏది ఉత్తమ సాహిత్యం? అన్న వ్యాసమూ 'ప్రాక్ప్రతీచీ భూపతులు' అన్న రచనా చాలా శాశ్వతమైనవి. పరిశోధనాత్మకమైన శ్రీనాథుని జన్మస్థల వివాదమూ, హరిహరనాథుని గూర్చిన చారిత్రికాంశాలూ, శర్మగారి వైదుష్యానికి నిదర్శనాలు. 'శ్రీనాథుణ్ణిగురించేకాదు ఐన్‌స్టయిన్ని గురించి కూడా" వ్రాయగలిగిన వీరి మేధను పరిశీలించి, అనేక విస్తృతాంశాలను అనుభంలోకి తెచ్చుకోవాలనే ప్రతి వాఙ్మయ పిపాసికుడూ చదివి తీరవలసిన గ్రంథం "నరుడు-నక్షత్రాలు"

"రాత్రి మనం కలిసి పాడిన పాటలు ఇంకా పొదల్ని వదల్లేదు; కొమ్మల్నించి నేలకు రాలిన పువ్వులు కొమ్మల్లోకి తిరిగి పోనేలేదు; కొబ్బరి మట్టల్లో కురిసిన వెన్నెల ఇంకా బొట్లు బొట్లుగా రాలడం ఆగనేలేదు" (నాదే-నాప్ర)

# ఊహలో:

శ్రీ బి. కె. రావు I. A. S

శర్మగారితో నాకు 1961 సంవత్సరం నుంచి పల్చ పల్చగాఉన్న పరిచయం, కాలక్రమేణా స్నేహంగా పేరుకొని, రాను రానూ ఆత్మీయతగా ఘనీభవించడం జరిగింది. మొదటి రోజుల్లో ఆధునిక వస్తువుతో, పూర్వ మహాకవుల పద్య రచనా మర్మాలు జీర్ణించుకొని, విశుద్ధమైన ధారతో జాలువారే వారి కవనాన్ని ఆస్వాదించే అదృష్టంకలిగింది. అనతికాలంలోనే అఖండకవితా యశస్సు గడించిన శ్రీ క్షేమేంద్రశర్మగారు ఆనాడు తెలుగులో "నియోక్లాసిసిస్ట్స్" అని పిలువబడే కోవకుచెందిన ఆణిముత్యంలా కనుపించేవారు. అప్పట్లోనే వారు చేస్తూఉన్న సంస్కృతాంధ్ర సాహిత్య మథనాన్ని సాధ్యమైనంత దగ్గిరగా ఒడ్డున కూర్చునిచూచే భాగ్యంకూడా లభించింది.

అప్పటికే వారి రచనా వ్యాసంగం రంగం మారుతున్న ఛాయలు గోచరించాయి. పోయిన నాలుగైదేళ్ళలో వారు వెలువరించిన అపూర్వ సాహిత్య విమర్శలను, ఆవిష్కరించిన నిగూఢ నిక్షిప్త మర్మాలనూ, నిరూపించిన సాహిత్య ప్రయోజనాలనూ, వారు సాహిత్యాన్ని చూడ గలిగిన విలక్షణ నూత్నకోణాలనూ - చూస్తే, ఆయన అప్పుడే చాలా దూరం ప్రయాణించి నూతన తీరాలను వెతుకుతున్న జిజ్ఞాసువుగా పొడగట్టేరు.

ఈనాడు వారి ప్రస్తుత రచనచూస్తే వారి ఆలోచనాశక్తి రెక్కలు సంతరించుకుని విహాయస మార్గంలో సాదారణ నిమ్నోన్నతాలకు అతీత మయిన వినూత్న దృష్టితో సాగుతున్నట్లు తెలు స్తోంది. ఇది గ్రహాంతర యానయుగంకదా! ఆ రెక్కలమీద మనకుకూడా కొంత విహంగయానం అలవడుతుంది.

కవిశ్రేష్ఠులైన శర్మగారు కాలేజీలో రసాయన శాస్త్రం అభ్యసించారు. ఇంటివద్ద పిత్రీయంగా

సంక్రమించిన సంప్రదాయ విజ్ఞాన సముపార్జన చేశారు. వీటికితోడు సహజసిద్ధమయిన సునిశిత ధీశక్తి వారికి పూర్వజన్మ సంచితం. దానాదీనా, వారి ఆలోచనా వ్యవసాయ క్షేత్రానికి ఎల్లలు బహువిస్తృతాలు.

రచనకుండవలసిన ప్రోద్బలాన్ని గురించి వెనకటికి మెకాలే అన్నాడు. "It should be to the fullness of the brain but not the emptiness of the pocket." శర్మగారు లోకానికి చెప్పవలసిన సామాగ్రిఉండి అది చెప్పకపోతే తప్పని, తపన అనుభవించిన తర్వాతగాని రచన చేయరు. "అస్తమానమూ కవిత్వమూ సాహిత్యమేనా? ఎన్నాళ్ళు ఈ శుష్క సాహిత్య వ్యాసాలతో కాలం గడుపుతాము? రచనల్లో, మానవకృషిలో వైవిధ్యం ఉండాలి; ప్రగతి సర్వతోముఖంగా సాగాలి;" అన్నారు. అందుకే తమ ఊహామార్గంలో పరిత్ర లోకాన్ని ఓ రం గు ల రా ట్నం మీద ఎక్కించి గబగబా అన్నీ చూపించేశారు. అలసి చల్లారిన నక్షత్రాలూ, బలసి పగిలిన సూర్య

గోళాలూ, భయముయొక్క అవధులు, జీవపరి ణామానికే మూలశక్తి అయిన బాధా దానిలక్ష ణమూ, మానవ సౌభాగ్యానికి సంప్రదాయము యొక్క ఆవశ్యకమూ, స్వాతంత్ర్యానంతర సాహిత్యంలో మూలబడ్డ ద్వాపరాంతపు గాండీ వాలూ...యిలాయిలా అనేక విషయాల్ని తిలకింప జేశారు. ముఖ్యముగ నన్నయ భారతంనుంచి యీనాటి సినిమా సాహిత్యంవరకూ తెలుగురచన అనుకరణ, అనువాదాలమీదా ఎందుకు ఆధార పడ వలసి వచ్చిందోకూడా చర్చించారు. దేశమాత దయ నీయస్థితి తలచుకొని శకలాం వికలాం బహుకుల సంకులాం శోకవ్యాకులాం మాతరం, భూరినిరాశా నామక యామినీం జీర్ణద్రుమ జీవిత శోభినీం, విలాపినీం విచార ప్రాపిణీం, జ్వరదాం భయదాం మాతరం" అనివాపోయారు. అతి విచారకరమయిన ఈ పరిస్థితినుంచి దేశాన్ని రక్షించాలంటే, ప్రతి యింట్లోనూ వంటగది ఉన్నట్లు పుస్తకాలగది ఒకటి ప్రత్యేకంగా ఉండవలసిన అవసరం గురించి వివరిం చారు. వారి పవిత్రమయిన పుస్తకాల గదిలో ఒక సారి మానసికంగా మడిగట్టుకొని కూచోవాలని

స్తూంది. ఈయన వీలుంటే హార్షుణ్ని హాక్స్లీని బ్రేక్ ఫాస్టుకు పిలిచి, అరిస్టోటిల్ భాసులతో లంచ్ ఆరగించి, క్యాంట్ కాళిదాసులతో డిన్నర్ ముగించేలా కనిపిస్తాడు. దేశకాల అవధుల్ని దాటి విశ్వమానవ చరిత్రలోని మేధఃపుంజాలతో సహపంక్తిని ఆలోచనామృతాన్ని ఆరగించడంకంటే కావలసిందేముంది. శేషేంద్రశర్మగారితోబాటు "ఊహాలో"నైనా వారి సహాంతేయులం కావచ్చు.

"ఉన్నది ఒక్కగుండె వంద గాయాలకు చోటెక్కడిది" (మండేసూ)

"గాయాలు చేసుకున్న గడచిన రోజులు రక్తాభిషేకం చేసుకున్న రాజులు" (శేషజ్యో)

ఏ అంగూరు రక్తం తాగి అనుభవిస్తున్నావో ఆ నాజూకు నిషా, అది ఆ చితికిపోయిన ప్రాణినీ చేతిలో కోల్పోయిన జీవనతృష" (మండేసూ)

# ఊరహాలో

**ఆయాస్య**

నవీనాలైన నవవ్యాసాల సంపుటిఇది.

ప్రస్తుతకాలంలో మనభాషలో కవితలు వెలువడు తున్నంత జోరుగా వ్యాసాలు రావడంలేదు పరి మిత ప్రయోజనంగల కవితల కంటే ఎక్కువ ఉప యోగంగల వ్యాసాల సంపుటాలు ఎన్నో కావలసి ఉన్నవి. ఆ వ్యాసాలలోనూ భౌతిక విజ్ఞాన పరి జ్ఞానంలో వెనక బడి ఉన్న మన వారికి వివిధ విష యాలను గురించి తెలిపే వ్యాసాలు జనసామాన్యా నికి అర్ధమయ్యే సులభమైన భాషలో ఎంతో అవ సరం ఆ అవసరాన్ని కొంత వరకైనా తీర్చడానికి ఈ వ్యాస నవకం మిక్కిలి ఉపయోగిస్తుంది.

శేషేంద్ర శర్మగారు బహుముఖ ప్రజ్ఞాధురీణులు. నేటి ఆంధ్ర సారస్వత రచయితల్లో ఎన్నదగినవారు. ఇది వరకే "పక్షులు, "ఋతు ఘోష" "నరుడు-నక్ష

త్రాలు" 'షోడశి', 'స్వర్ణహంస', "సాహిత్య కౌముది" మొదలైన గ్రంథాలు వ్రాసి లబ్ధ ప్రతిష్ఠు లయినారు. ఏ విషయం చెప్పదలచినా, సప్రమా మాణంగా వివరించగల సమర్థులు.

శర్మగారి వ్యాసాలలో వైవిధ్యమే కాకుండా నవ్యత కూడా కాన వస్తుంది. వీరినీ, వీరి ఈ పుస్త కాన్ని, పరిచయం చేస్తున్న బి. కె. రావుగారు "పోయిన నాలుగైదేళ్ళలో వారు (శర్మగారు) వెలువరించిన అపూర్వ సాహిత్య విమర్శలను, ఆవిష్కరించిన నిగూఢ నిత్తిప్త మర్మాలను, నిరూ పించిన సాహిత్య ప్రయోజనాలనూ, వారు సాహి త్యాన్ని చూడగల్గిన విలక్షణ నూతన కోణాలను చూస్తే ఆయన అప్పుడే చాలా దూరం ప్రయా ణించి, నూతన తీరాలను వెతుకుతున్న జిజ్ఞాసువుగా పొడగట్టారు" అని వ్రాస్తున్నారు. శర్మగారి ఊహాలు పఠితలకు విజ్ఞాన ప్రయోజకమైన జిజ్ఞాస కలిగిస్తాయి. ఇవి శర్మగారి బహుముఖ విజ్ఞానానికి ప్రతీకలు. ఊహాలో మరికొన్ని ఊహాలను స్ఫురింప జేసే వ్యాసాలివి.

షోడశి (రామాయణ రహస్యములు)

# స్వర్ణహంస

—శ్రీ కప్పగంతుల లక్ష్మణశాస్త్రి

బ్రహ్మర్షి వాల్మీకి నిర్మితమగు ఆదికావ్యము రామాయణము వేదవ్యాస మహాముని రచితమైన మహాభారతము విద్వత్కవితల్లజుడైన శ్రీ హర్ష భట్టుచే నిర్మింపబడిన నైషధీయ చరితము ఈమూడు గ్రంథములును భారతీయ వాఙ్మయము నందేగాక ప్రపంచ వాఙ్మయములందు గూడ అగ్రశ్రేణికి జెందినవి.

ఏతత్ప్రబంధ రత్నాకరములో సాహిత్య నౌకలను నడుపుచు అందలి అమూల్య భావ రత్నములను వెలికితీసి తెలుగు ప్రజల కంఠహారముగా గూర్చి యిచ్చిన కర్ణధారుడు మిత్రుడు, గుంటూరు శేషేంద్రశర్మ. అంతేకాక అత్యంత కృపిసల్పి

ఈ గ్రంథములందు నిక్షిప్తములై యున్న మంత్ర యోగ వేదాంత శాస్త్రామృతమును వెలికితీసి బుధులకు పంచిన సాహితీ కర్మయోగీంద్రుడు శేషేంద్రుడు.

వీరు ప్రతిపాదించిన ఈ క్రింది విషయములు అత్యాశ్చర్యకరములేగాక సోపపత్తికములై విద్వాంసుల తలలూపించగల అపూర్వతచే శోభిల్లుచున్నవి-

రామాయణ మందలి హనుమదాకాశ గమనము కుండలినీ యోగమనియు, లంకా స్థిత సీత మూలాధార స్థిత కుండలిని యనియు, శర్మగారు చూపించిన నిదర్శనములు నిర్వివాదములుగా నున్నవి. అన్నిటికంటె ఆశ్చర్యకరము త్రిజటా స్వప్న వృత్తాంతము గాయత్రియని నిరూపించుట. ఈ వ్యాఖ్యానములు బలవత్కృతములుగా గాక సహజార్థ స్ఫోరకములై వాల్మీకిచేతనే యుద్దేశింపబడినవై ఈయనచేత ఆవిష్కరింపబడినవా యనిపించు చున్నవి. ఏతత్ప్రతిపాదిత విషయములను పూర్వమెవ్వరును ప్రతిపాదించి యుండనందున సంస్కృత వాఙ్మయ సరస్వతికి ఇదియొక యపూర్వ

మైన కానుకగా నీయన సమర్పించారని చెప్ప వచ్చును.

అట్లే శ్రీ శర్మగారు వ్యాసభారతము నందలి నలోపాఖ్యానమును వాల్మీకి సుందరకాండమునకు ప్రతిబింబమనియు, మహాభారతము రామాయణమునకు ప్రతిబింబమనియు నిరూపించుచు చూపిన ఉపపత్తులు వాస్తవముగా అత్యాశ్చర్య జనకములై పఠితలకొక యపూర్వవిషయమును తొలిసారిగా నావిష్కరించు చున్నవి.

ఆ విధముగనే నైషధమునందలి హంస హంస మంత్రాధి దేవతయనియు, దమయంతి శ్రీ మహాలక్ష్మియనియు నైషధీయ చరితమనగా జీవుని చరితమనియు హంసగమనము యోగానుష్ఠానమనియు శర్మగారు తత్కావ్యగత శ్లోకార్థములను వివరించుచు నిరూపించిన పద్ధతి శాస్త్ర సమ్మతముగను, విద్వదాదరణీయముగను ఉన్నది.

ఇట్టి యపూర్వకృషి సల్పిన శ్రీ శర్మగారి మేధాసంపత్తి, భాషావైశారద్యము, పాండిత్యము,

అత్యంత ప్రశంసనీయములు. ఇట్లు ఈ గ్రంథత్రయములో దాగియున్న అపూర్వార్థములను ఇంతవర కెవ్వరును మనకు చూపియుండలేదు కనుక ప్రతి భారతీయుడు వీరి ఈ యపూర్వకృషికిగాను వీరి యెడల కృతజ్ఞతను చూపించవలసి యున్నది.

గీర్వాణ వాణీ మకుటాగ్రరత్న
త్రయం కషన్ దీప్తిమఖండ భూతలే
సంవ్యాపయత్ కోవిద ముఖ్యపష
శేషేంద్రశర్మా తమిమంస్తువేఽహం——

"తల దాచుకొనుటకు నెలవు జానెడులేదు అన యంబు నా దేశమనుటయేల ?... నన్నుబోలిన యావదా పన్నజనులు, నాదు జాతిగభావింతు నాద. రమున అంతియేగాని దేశమేదైననేమి, దాసుడను గాను మూఢవిశ్వాసములకు" (పతులు)

"నేను విరిగిన కలలోనించి పుట్టాను, విరిగిన ఇంద్రధనుస్సు కార్చే రంగుల్లో స్నానం చేస్తాను... నా కలల దేశంలో నాకున్నది ఒక్కగుడిసె; నేను ఎందుకు బతకాలో ఒక సున్నలో నాకే తెలీదు" (నాదే-నాప్ర)

# షోడశి

(రామాయణ రహస్యములు)

**మహాపండితః వాచస్పతి బిరుదాంకితః**

**శ్రీమాన్: గుండేరావ్ హర్కారే**

గ్రంథోత్తమస్య రామాయణస్య వ్యాఖ్యానాని కాలేకాలే తై స్తైర్మహా పండితైః విరచితా న్యాధ్యాత్మిక విషయ ప్రతిపాదకాని వ్యాకరణ మీమాంసాది శాస్త్ర సిద్ధాంత పూర్వాని సామా జిక రాజకీయ సూక్ష్మతత్త్వావ బోధన పరాణి రస భావాది ధ్వనితత్త్వ ప్రకాశకాని గాంధర్వ శాస్త్ర ప్రతిపాదకాని బహూనిసంతి.

మయా అధునా 'షోడశీ' గ్రంథః సాదర మామూలాగ్ర మవలోకితః. అయం స్వతంత్రో గ్రంథో న కస్యాపి వ్యాఖ్యా రూపః. రామాయణ విషయమధికృత్య స్వతంత్రా అమూల్యా విచారా అస్మిన్ గ్రంథే ప్రదర్శితాః. అత్రభవాన్ శ్రీమాన్

గుంటూరు శేషేంద్రశర్మ మహాశయో గ్రంథస్య అస్య ప్రణేతా ఆంధ్రాంగ్లగీర్వాణ భాషాసు నిష్ణాతః. కుశాగ్ర ధిషణః నానాతంత్ర ప్రవీణః శాక్తాగమ రహస్య విశేషజ్ఞః. వాల్మీకి రామాయణాధ్యయనే కృతభూరి పరిశ్రమోస్తి. అస్య మహావైదికస్య సూక్ష్మతమా విచారసరణి రనన్యాదృశీ. వివిధ తంత్రాగమ సిద్ధాంతాన్ సమ్యగవగమ్య సంప్ర దాయాంశ్చ విజ్ఞాయ తాంత్రిక రహస్యాన్యన్యత్రా దృష్టాని మహాకవినా మహాతా కౌశలేన రామా యణే తత్ర తత్రోపనిషద్ ధ్వానితీ సప్రమాణం ప్రతిపాదయతి గ్రంథకృత్. అత్ర గ్రంథరచయితు శ్శైలికీ చింతన పద్ధతిః కతిపయై రుదాహరణైః ప్రదర్శ్యతే.

రామాయణ మాదికావ్యమితి సర్వైర ప్యంగీ
క్రియతే.

'మానిషాదే'తి ఛందోమయీ వాక్ మహాకవే ర్ముఖా దాదౌ నిఃసృతేతి ప్రతిపత్త్యైవ కేవలంన. అత్రవిషయే గ్రంథకారః ప్రత్యక్ష ప్రమాణా న్యనేకాని దర్శయతి.

మహాత్మా పరిశ్రమేణ అనేక గ్రంథావలోక నేన సతతవ్యాసంగేన చ అనన్యలభ్యాని ఇమాని అగాధాంభోధి తలాత్ మహార్ఘ మౌక్తికాని సమానీయ ఇదం ప్రాథమ్యేన జగతి ప్రదర్శయతి. తస్య అయం 'సంక్షేపః-రామాయణే' ఇతివృత్త కథా సందర్భ రూపేణ ప్రదర్శితాః నాయకనాయికా వ్యాపారాః సర్వేపి తాంత్రిక రహస్యపూర్ణా వైదిక సంప్రదాయ ప్రవర్తకాశ్చ. శ్రీమద్రామాయణం రహస్యరత్నకోశఏవ. 'రహస్యంచ ప్రకాశంచ' ఇతి బాలకాండే ద్వితీయే సర్గే ప్రదర్శిత శ్లోకద్వయార్థాను సంధానేన రామాయణోక్తో రామకథాయాః ప్రసిద్ధార్థః అన్యః రహస్యార్థోన్యః. వాల్మీకి రహస్యమిదం మహాత్మా కౌశలేన జుగోప. లలితమనోహర శబ్దైర్ధ్వని పూర్ణార్థైః రసభావోజ్జ్వల ప్రకరణైశ్చ ఏకమపూర్వ మావరణం నిర్మాయ తస్మిన్ తత్ర రహస్యరత్న మంజూగుహాత.

ఏతద్రహస్యజ్ఞానాయ బహవో గ్రంథాః ప్రవృత్తాః. ప్రథమతః ఉపనిషదః సీతోపనిషద్రామ రహస్యోప నిషదాం తాపిన్యుపని దిత్యాదయః ఏతా

సూపనిషత్సు వాల్మీకి ప్రోక్తం రామాయణం మంత్ర రహస్య పూర్ణమితి ప్రతిపాదితం. తద్రహస్యావబోధాయ ఉపాయాః అనుష్ఠాన ప్రకారాశ్చ దర్శితాః. అనంతరం పౌరాణికయుగే తద్రహస్యావగమాయ వివిధాః ప్రయత్నాః కృతా ఇతి స్పష్టతయా ప్రతీయతే. మహాభారతే బ్రహ్మాండ పురాణే దేవీ భాగవతే మార్కండేయ పురాణేచ శాస్త్రదృష్ట్యా రామాయణస్య అధ్యయన మనన ప్రకారా దర్శితాః ఉమాగస్త్య పరాశరాది సంహితాసు రుద్రయామళే తంత్రే గాయత్రీ వర్ణాత్మక దివ్యసహస్రనామస్తోత్రాదిషుచ సీతాయాః ప్రభావః సీతాపరాశక్తిరితి ప్రతిపాదితః. బ్రహ్మాండ పురాణే తావద్రామాయణస్య మహామంత్రత్వేన అనుష్ఠాన విధిరపి ప్రదర్శితః. సుందరకాండ పారాయణ మాహాత్మ్యం పారాయణాయ ప్రకారశ్చ సవిస్తరం ప్రదర్శితౌ. అత్రాయం విశేషః. అధ్యాత్మరామాయణే రామస్యోపనిషద్ బ్రహ్మ స్వరూప నిరూపణేన రహస్యం ప్రకటీకృతం. దేవీభాగవతే సీతాయాః పరాశక్తిత్వ ప్రతిపాదనేనాపి గూఢ రహస్యా విర్భావః కృతః. వాల్మీకినాపి సర్వం రహస్యముపదిష్టం

పరంతన్న క్వాపి ప్రకటీకృతం. సులలితపద విన్యాసే శోకవీరాది రసపరిపోషాత్మక రచనాయాంచ గూఢ తయా నిక్షిప్తం ఈ దృశం పరమ రహస్యం ప్రథ మతః కావ్యే నిబద్ధమితి రామాయణ మాదికావ్యం స్పష్టమేవ.కించ భాసకాళిదాస భవభూతి ప్రభృతయో మహాకవయస్తావన్మ మహర్షేః కావ్య రచనా కౌశలే నైవ సంతుష్టాంతరంగాస్తస్యా ద్వితీయ రసభావాది పరిపోషరీతిమేవ అనుకుర్వంత స్తద్వ్యాఖ్యా రూపా ణ్యలౌకికానందదాయీని నవీనాని కావ్యాని వ్యర చయన్.

వేదార్థజ్ఞానా యైవఖలు సర్వాణి శాస్త్రాణి పురాణానిచ ప్రణీతాని. వాల్మీకికాలే సాహిత్య వాఙ్మయస్య నాతి విస్తరః. తదానీంతనే కాలే వేదా నాం కావ్యేభ్యో అవ్యవహిత పూర్వవర్తిత్వమేవ. తస్మాత్త ఏవవైదికా విచారాః కావ్యాత్మనా పరిణతా దృశ్యంత ఇతిస్పష్టమేవ. ఏష విషయః శ్రీ శేషేంద్రశర్మా మహోదయేన అతీవ స్పష్టతాం నీతః. అత్రైవ రచయితు ర్మౌలిక విచార విచక్షణ త్వం. "శోయమల్ప మివాదిత్యః ప్రాణా నాదా

స్యతే శ్వరైః" ఇతి రావణం ప్రతి సీతాయా ఉక్తిః. అత్ర జలముపమానం ప్రాణా ఉపమేయం. సమాన ధర్మం క ఇత్యధునాతనా ఆలంకారికాః సంశేరతే. తదానీం వేదాధ్యయనస్య జాగరూకత్వాత్। ఆపోవా ఇదం సర్వ। మితి యజుషి 'ప్రాణా ఆప' ఇతి సుస్పష్టం శ్రుత్యైవోక్తం.

నిశి హనూమతః సీతాన్వేషణ సమయే చంద్రో దయవర్ణన ప్రసంగే 'దదర్శ ధీమాన్ దివి భాను మంతం గోష్ఠేవృషం మత్తమివప్రభమంతం' ఇతిశ్లోకా ర్థోవర్తతే. ఉపమేయం వైదికి. నీలే నభసి శ్వేత శ్చంద్రో రాత్రౌ తమసా వ్యాప్తే గోష్ఠే శ్వేతో వృషా. 'దేవీం వాచమజనయంత' ఇత్యత్ర 'ధేను ర్వాక్' ఇతి యదుక్తం తస్మాద్దేవ గృహీతేయము పమా. ఏవమేవ 'మనోహారసిమే ఖీరు సువర్ణః పన్నగంయథా' ఇయ ముపమాపి త్రిసుపర్ణాఖ్య సూక్తాదేవ సూచితా స్యాత్. ఏవంబహుభిః ప్రమా ణైః కావ్యస్యాస్య సాక్షాద్ వేద మూలకత్వం స్థాపితం గ్రంథకృతా. ఏతేన గ్రంథకృతో వేదా ద్యాగమశాస్త్ర ప్రావీణ్యం సాహిత్య వైశారద్యంచ

వ్యక్తీభవతి, యే రామాయణ వ్యాఖ్యా గ్రంథా మహాపండితై ర్విరచితా బహవో నిర్దిష్టాస్తేషు తత్ర చ్ఛాస్త్ర సిద్ధాంత విశేషాః సాధక బాధక ప్రమాణ ప్రదర్శన పూర్వకం ప్రతిపాదితాః. పరమి ద్భశం మంత్ర రహస్య ప్రకాశనం నక్వాపి దృశ్యతే. తస్మాత్ గ్రంథకృతా యత్ ప్రతిపాదిత ముపనిష దాం బ్రహ్మాండాది పురాణాని మహాకవి కావ్యాని రామాయణ రహస్య బోధకత్వాత్ రామాయణ వ్యాఖ్యా గ్రంథాః ఇతి తత్సత్య మేవేతి ప్రతిభాతి. కించ అనేకే ప్రమేయా గ్రంథకృతా ప్రదర్శితాః స్థాలీపులాకన్యాయేన కేచిదత్ర అనూద్యంతే. సుందరకాండస్య విశేషతో మాహాత్మ్యముపవర్ణితం. సాధారణతః రామాయణే కాండరచనా క్రమః కథానాయక స్యావస్థా విశేషానురోధేనైవ దృశ్యతే బాలకాండే రామజన్మాదికథా, అయోధ్యాకాండే విశ్వామిత్ర యజ్ఞ రక్షణం వివాహాదిచ అరణ్యకాండే రామస్య అరణ్యవాసః కిష్కింధాకాండే హనూ మత్సమాగమః వాలివధశ్చ-ఏవంయుద్ధకాండ ఉత్తర కాండేపిచ కథానాయక వ్యాపార విశేషానురోధే నైన ఇతివృత్త వర్ణనమ్. మధ్యే సుందరకాండే

కల్పన విశేషో దృశ్యతే. కథానాయకేనాత్ర సాక్షాత్ సంబంధో న దృశ్యతే కింతు నాయికా సంబంధః సీతా జనక తనయేత్యాది సాక్షాన్నాయికా వాచకాః శబ్దా న ప్రయుక్తాః. సుందరీ శబ్దప్రయోగః కించిద్విశేషం జ్ఞాపయతి. త్రిపురసుందరీ పరా శక్తిరేవ సీతేతి వస్తునావస్తు ధ్వనిః. అతఏవసర్వత్ర సుందరకాండ పారాయణ పఠనానుష్ఠాన సంప్రదాయః. రామాయణస్య వేదరహస్య ప్రతిపాదకత్వం తంత్ర శాస్త్ర దృష్ట్యా సాహిత్యశాస్త్ర దృష్ట్యాచ అభ్యుపగమ్యతే.

అపిచ 'తతో రావణనీతాయాః' ఇతి సుందరకాండ ప్రథమశ్లోకే రావణేన నీతాయాః సీతాయాః పదమన్వేష్టుం హనుమాన్ చారణా చారితే పథి ఇయేషేత్యుక్తం వాల్మీకినా. 'చారణా దేవగాయకాః' ఇతిప్రసిద్ధం. చారణాశ్చాంతరిక్షే సంచరింతి అయంతావత్ శ్లోకస్య పదశక్తిజన్యో వాచ్యార్థః మహర్షి సంకేతార్థస్తు అన్యఏవ హనుమాన్ గగనే పుప్లువ ఇతివక్తవ్యే చారణా చరితమార్గ గమన పర్యంత మనుధావనం కింఇతిచేత్ అత్రశబ్ద ప్రయోగ

ఏవ పరమం రహస్యం. చరణశబ్దః కుండలినీ వాచకః లలితా సహస్రనామభాష్యే 'బిసతంతు తనీయసీ' తి నామవ్యాఖ్యావసరే శ్రీమద్భిః భాస్కరరాయ మహాశయైః చరణశబ్ద శ్చరతీతి యాతాయాతం కరోతీతి కుండలినీపరః సామాన్యే నపుంసక మిత్యుక్తం. సీతా పరాశక్తిరేవ, పరాకాశమేవ బ్రహ్మణోఽభి వ్యక్తి స్థానం. అతఏవ పరాకాశాయై నమో గగనావస్థాయైనమ ఇత్యాది సంగచ్ఛతే. అత్రహనుమచ్ఛబ్దోఽపి విశేషమర్థం సూచయతి. మారుతాత్మజ ఆంజనేయ ఇత్యాది నామవాచకాః శబ్దాః సన్త్యపి ప్రయుక్తాః. 'అంతరేణ తాలుకే య ఏష స్తన ఇవాలంబతే సేంద్రయోని' రితి తైత్తరీయ ప్రమాణాను సంధానేన హనుమచ్ఛబ్దస్య సుషుమ్నే వార్థః. పవనాత్మజోఽస్మిన్ కాండే హనూమాన్ ఇతి శబ్దేనైవ వ్యవహృతః. ఇదంతస్య దీక్షానామ. అనయైవ దిశా సర్వోఽపి సుందర కాండార్థః కుండలినీయోగ పరత్వేన వ్యాఖ్యాతః. అన్యచ్చ, హనూమతా సీతాదృష్టా, కీదృశీ?

'దదర్శ శుక్లపక్షాదౌ చంద్రలేఖామి వామలాం 'ప్రతిపచ్చంద్రలేఖేవ దృశ్యతే ద్యోతతే న చ

ఇత్యపి పాఠాంతరం. సాహిత్య శాస్త్ర దృష్ట్యా సీతా ప్రియ విరహేణ వనవాసేనచ అతీవ కృశా, ఇత్యలంకారేణ వస్తు ధ్వనిః నైతావతా నిర్వాహః ప్రతిపచ్చంద్ర లేఖా ధృవకళా ఆత్మకళా. ప్రతిపది యా త్రిపురసుందరీ కథితా చిద్రూపాత్మికేతి సౌందర్యలహరీ వ్యాఖ్యాయాం లక్ష్మీధరః. అభూతే నాపవాదే నేత్యాది శ్లోకేషు బుద్ధ్యాదయః శబ్దాః ప్రయుక్తాస్తే సర్వేపి తస్యాః పరాశక్తే రేవ నామాని. సప్తశతీ గ్రంథే బ్రహ్మకృత యోగ నిద్రాస్తుతా వేతాని సర్వాణి నామాని ప్రదర్శితాని. కించ, 'మయా రామస్య రాజర్షే ర్భార్యయా పరమాత్మనః '(సుంద కాండే 26-40) ఇత్యత్ర) పరమాత్మనో భార్యా సీతేతి శ్రుత్యైవ ప్రతిపాదితం.

ఏవమేవ త్రిజటాస్వప్నో స్వప్నో నకేవలం వ్యావహారికో జ్యోతిష శాస్త్రోక్త దిశా భావి శుభ సూచక ఏవ, కింతు రహస్య పూర్ణో గాయత్రీ మంత్రమయ ఇతి దర్శితం గ్రంథకారేణ. అత్ర త్రిజటేతి రాక్షసీ న. కింతు సాక్షాత్ గాయత్రీ. 'త్రిజటా తిత్తిరీ తృష్ణా త్రివిధా తరుణాకృతిః

ఇతి గాయత్రీ సహస్ర నామస్తోత్రే పంక్తిర్వర్తతే. (దేవీ భాగవతే XII 6.72) స్వప్నే హంస చతుర్దంత గజ వృషభాణాం శ్వేత వర్ణానాం దర్శనం శ్రీరామచంద్ర దర్శనం చ గాయత్ర్యా ద్యోతకం. గాయత్రీ త్రిరూపిణీ త్రిపదాచ - ప్రాతః కాలే గాయత్రీ మధ్యాహ్నే సావిత్రీ సాయం సరస్వతీతి. తిస్రూణాం వాహనాని క్రమేణ హంసో గజో వృషభశ్చ. ఏవమేవ దంత ఇతి శబ్దేన ద్వాత్రింశదితి, గజ శబ్దేనాష్టేతి సంఖ్యాజ్ఞాయతే. తేన చతుష్పదా గాయత్రీ ద్వాత్రింశదక్షరా. ఏతద్రహస్యార్థబోధక ఏవ త్రిజటాస్వప్నః.

ఏవం కుశాగ్రధిషణో గ్రంథకృత్ రామాయణే తాంత్రిక రహస్యాని గూఢాని ప్రదర్శ్య తస్య సర్వమహత్త్వం స్థాపయతి. రామాయణం భారతంచ తులనాత్మక దృష్ట్యా సమ్యక్పరిశీల్య రామాయణం వాల్మీకినా ఆదావేవ ప్రణీత, మనంతరం వేదవ్యాసో మహాభారతం వ్యరచయదితి సప్రమాణం ప్రతిపాదయతి. అద్యత్వే రామాయణం భారతానంతరం ప్రణీతమితి వాదః పాశ్చాత్యైవి పశ్చిత్ ప్రవరై రుత్థాపితః. విశేషతః పాశ్చాత్యానుకరణ

ప్రవృత్తేషు భారతీయ పండితమండలీషు జాగర్తి. గ్రంథకృతా ప్రదర్శితాభి ర్యుక్తిభిః ప్రమాణై శ్చాధునికో వాదోయం పూర్ణతయా నిరాకృత ఇతి స్పష్టమేవ ప్రతిభాతి. కించ భారతం రామాయణ రచనాం శబ్దశ్చార్థశ్చ అనుసృత్యైవ రచితం. కృతే ప్యనుకరణే శబ్దార్థౌచిత్య దృష్ట్యా విషయ ప్రతిపాదన రీతి దృష్ట్యాపి రామాయణ మహాభారతయో రంతరం స్పష్టతయా ప్రతీయతే. రచనాయాం వైలక్షణ్య ద్యోతకాః పరః శతాః శ్లోకా మహతా ప్రయత్నేన గ్రంథకృతా సంగృహీతాః.

యథా : రామాయణే - దేవతాభిః సమారూపే
సీతా శ్రీరివ రూపిణీ
భారతే- శ్రుత్వాథ తస్య తం శబ్దం కన్యా
శ్రీరివ రూపిణీ
రామాయణే - అనేక గంధప్రవహం
పుష్పగంధ మనోహరం
భారతే - మధు గంధైశ్చ సంయుక్తం
పుష్ప గంధ మనోహరం

ఇత్యాది.

కించ రామాయణే విష్ణు పారమ్యాపేతయా సర్వత్ర ఇంద్ర పారమ్యమేవ స్థాపితమితి గ్రంథ కృన్మన్యతే. 'ఇంద్రావిష్ణూ' ఇతి ప్రకరణే వేదేషు య ఇంద్ర ఇతి వర్ణితః స ఏవ పురాణేషు విష్ణుత్వేన పరిణత ఇతి ప్రమాణాని దర్శయతి; విస్తర భయాత్ తాన్యత్ర న ప్రదర్శితాని.

శ్రీ మచ్ఛేంద్ర శర్మా మహోదయః అపూర్వ ప్రతిభాశాలీ, ఆగమే ష్వధీతీ, సాహిత్య మర్మజ్ఞః. తేన మహతా శ్రమేణ ప్రమేయా అపూర్వాః సంశోధితాః, ఆధునికా భారతీయాః కేచన విశ్వ విద్యాలయేషు ఆచార్య పదవీం అలంకుర్వంతి. విద్వాంసోపి తే పాశ్చాత్యవిచారానుకరణశీలా జడ ప్రాధాన్య వాదినో జడభిన్నచైతన్యాస్తిత్వే సంశయానాభిన్న చైతన్యాస్తిత్వ మంగీకుర్వాణోపి ప్రాచీన వైదిక సంప్రదాయేషు ఉదాసీనా ఏవ ప్రాయశః వర్తంతే. తేషా మాగ్రహామీలితలోచనానాం లోచనోన్మీలనాయ శ్రుత్యంత ప్రదీప్త పారమహేశ్వర జ్ఞానాంజన శలాకేతి షోడశీగ్రంథోయ మిత్యలమ్.

# SHODASI

(Secrets of Valmiki)

Dr. N RAMESAN I.A.S.

The Book "SHODASI" written by my friend Sri Gunturu Seshendra Sarma, is literally his experiments in the study of Valmiki Ramayana. Sri Seshendra Sarma is a devout and erudite scholar in the Tantra Sastra. The present book is an attempt on his part, among other things, to explain part of Vamiki Ramayana in terms of Kundalini Yoga·

According to the learned author, the exposition of the story of Ramayana by Valmiki is not a mere narration in good and excellent poetic style. Underlying this is an attempt to infuse in it the directives of the esoteric theories of Kundalini Yoga Of all Kandas of Valmiki Ramayana, the author has given, and rightly so, great importance only to the Sundara Kanda which, as is well known, represents the quintessence of the Valmiki Ramayana's thought The first verse of the Sundara Kanda "Tato Ravana Nithayah" etc, has been interpreted by the

author as representing an attempt by Hanuman to traverse the path of the Sushumna, which is the mystic path situated betweenn the Ida and Pingala, thereby reaching the final goal of oneness with the Kundalini Sakti. The word "Charana Chartite Pathi" has been interpreted by the aurthor as the path of the Kundalini by deriving the word Charana as the Tadditant derivative of the word Charana. In a similar manner several other verses have been interpreted in an extremely interesting and original light. According to the author, this underlying Principle of interpreting Valmiki in the light of Kundalini Yoga is not merely a novelty that can be seen here and there, but represents a continuous under-current of thought which Valmiki keeps at the back of his mind while writing his immortal epic. In this respect, the author is of the view that Valmiki and his composition, are not mere poetical and emotional outpours but respresent a deliberate and well thought out attempt to teach the doctrines of Manthra, Yoga and Vedhantha.

The author has also shown a lot of interest and original work with regard to internal evidence of the Ramayana and Maha Bharata and has sought to bring out the antiquity of the Ramayana and its closeness to the Vedic thought. In particular, in the chapter on Indra Paratva as

opposed to Vishnu Paratva, the author has sought to bring out an original thesis that the Ramayana closely follows the predominent position of Indra in the pantheon of gods, which is the Vedic pattern as against the supremacy of Vishnu which is the Puranic Pattern. In other words the author contends that the Ramayana gives a discription of Vedic Indra who is supreme among the gods and not the Puranic Vishnu. Hence the antiquity of Ramayana is sought to be established as being more in consonance with the Vedic pattern than with the Puranic pattern of Vishnu,

The author also has done extensive research into the Maha Bharata and proves conclusively that Vyasa has, in his Maha Bharta elosely followed Valmiki in several aspects of epic writing including description of hills, description of rivers etc., The description of Damayanthi as "Malina Vastrangi" in the harem of a king in the guise of Sairandhri is compared with the description of Sita in the Asokavana of Valmiki. Similarly the flight of Garutman in search of nector from the heavan is soughs to be equated with the description of the fight of Hanuman over the seas Many other chaste sanskrit expressions like "Krodhamurchitaha" "Satya Parakra maha" etc , with which we are so familiar in later Sanskrit literature and which were first made

familiar by Valmiki are found embedded into the Maha Bharata. Several other verses have also been similarly repeated in Vyasa's Maha Bharata.

The author's erudite scholarship and keensense of research are evident through out the book. The book is an original attempt at a re-interpretation of Valmiki in a new light and all Devi Upasakas would gladly and gratefully welcome this. The book is so thought-provoking and so well written that it deserves to be translated into English and several other Indian Languages so that the new ideas propounded by the author can be made accessible and studied by several scholars of the several regions of our country.

"ఈపచ్చ ఉమిసే నికుంజ పుంజాల మాటున్నే నా కుంచె శబల భావాల రంగుల్లో ముంచి నీపాదాల మీద చిలిపిగా ఏవో పికాసో బొమ్మలు గీచాను" (మండేసూ)

"నిన్నూహించి రెండు ముక్కలు చెపితే అవే రెండు రెక్కలయి ఊహా విహాయసంలో కెగిరి పోతుంది, అదే ఒక గీతం అవుతుంది అదే ప్రేమ కపోతం అవుతుంది" (శేషజ్యో)

# షోడశి

కీ॥ శే॥ జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి

మీ షోడశి చదివి ఎంత సంతోషం పొందానో చెప్పలేను। ఈ నెల 2వ తేదీన, శ్రీ నీలంరాజు V శేషయ్యగారి దగ్గర, మాటలలో మీ మాట, షోడశి మాట వచ్చింది। వారు ఇంతకాలం, యింత మంది పండితులకు అందనిది, ఈ శర్మ గారికి ఎట్లా అందిందీ అని అడిగారు। న్యాయం అని నాకుతోచిన సమాధానం చెప్పాను। అదేమిటి? ఎప్పుడూ ప్రతి గొప్ప సంగతీ, సమయాలను బట్టి, సాధకులను బట్టి వారివారి ప్రతిభాబలాన్ని బట్టి తోస్తూంటుంది. ఇది లోక సామాన్యం। అని నా సమాధానం। అప్పటికి మీ పుస్తకాన్ని నేను చదువలేదు। ఈ వుత్తరం, చదివి వ్రాస్తున్నాను। ఒక్కసారి షోడశి (గ్రంథం నతు మంత్రం) చదివి వ్రాస్తున్నాను। తిరిగి ఒకటి రెండుసార్లు చదువుతాను। ఒక వ్యాసం షోడశిపైన

వ్రాయాలని అనుకొంటున్నాను। పరమేశ్వరి కృపపమో. మీ ఆరోగ్యాదికం వ్రాయించండి. వీలయితే హైదరాబాదు వచ్చినప్పుడు తమ దర్శనం చేసుకొంటాను। శుభమస్తు॥

మీ

జ. రుక్మిణీనాథశాస్త్రి

19-1-68

"తోటల్లో ద్రాక్షపండు ఎండ తాగి బలిసింది పన్ను తగిలితే చాలు రసము తుళ్ళి పడుతోంది" (మండేసూ)

"చీకటి సాయంకాలాలతో జీవితం కొలుచుకుంటున్నాను...కన్నీటిలో గుండెపిండి కవితమీద ఆరవేశాను, జనతా శాలువా కప్పుకుని చరచరా వెళ్లిపోయాను, దేశ దేశాల జ్వాలల సభల్లో నా దేశ ద్రిమ్మరి కంఠం విప్పి భూనభోంతరాలు కలుపుతూ గానం చేశాను" (మండేసూ)

# షోడశి (రామాయణ రహస్యములు)

—యామిజాల పద్మనాభస్వామి

సీతను వివరిస్తూ కావ్యకంఠులు సీత కమలాత్మిక అవతారం అన్నారు. సుందరీ వ్యాఖ్యానమందు చెప్పినదంతా సీతకూ, కమలాత్మికకూ సంఘటించారు.

సీతను గురించి చాలా చెప్పారుగానీ ప్రస్తుతాంశానికి కావలసినంతవరకే ఎత్తిచూపాను. ఇది యీ 'షోడశి—రామాయణ రహస్యము ల'లో సీతకు సంబంధించినంతవరకూ భాష్యమా ? అన్నట్టు వివరించి ఉంది.

శ్రీ శేషేంద్రశర్మగారు ఎంతో ఓపికగా రామాయణాన్ని చదివి అర్థం చేసుకొని ఈ రహస్యాలు వెల్లడించారు. లలితా సహస్రనామావళిని, ఉపనిషత్తులను వేదాలను రామాయణానికి తాను చెప్పబోయే

వ్యాఖ్యానానికి ప్రమాణగ్రంథాలుగా స్వీకరించ డంలో శర్మగారు చరితార్థులయ్యారు. సీతను కుండలినీ శక్తిగా నిరూపించుటకు శర్మగారు. చూపిన ప్రమాణములు, చేసిన సమన్వయములున్ను మంత్రశాస్త్రజ్ఞానం ఉన్నవారికి ఆనందదాయక ములు. సామాన్య శాస్త్రజ్ఞానం ఉన్నవారికి అద్భు తావహములున్నూ అనడానికి నేను జంకను.

లంక త్రికూట శిఖరమునగలదు శిఖరమనగా కొన. త్రికూటములు శరీరమందలి సాత్విక రాజస తామస ఖండములు. శ్రీ విద్యయందిది శక్తి, కామరాజ వాగ్భవఖండము లనబడును అని వ్యాఖ్యానించారు శర్మగారు. దీనినే కావ్యకంఠులు

'వాక్కామ శక్తిభిః
తామిమాం శ్రీవిద్యామాహుః
ఆసుర్వేషా గాయత్రీ'—అనిఅన్నారు.

ఇది తన తత్వశాస్త్ర సారభూతం, స్వానుభవం ఆలంబనగా రామాయణ క్షీరసముద్రాన్ని మథించి

ఈ విశిష్ట విషయామృతాన్ని శర్మగారు బయట పెట్టారు.

ఇంద్రునిగూర్చి శర్మగారు చేసిన వ్యాఖ్యానం ఆర్ష దృష్టితో అర్థం చేసుకోవాలి. గణపతిముని యింద్రసహస్రం చదివి నేనీ విషయాన్ని సులువుగా అర్థంచేసుకున్నాను.

ఇంద్ర విష్ణు శబ్ద నిర్వచనాన్ని అర్థతత్వాన్ని శర్మగారు ప్రత్యాఖ్యానానికి తావివ్వకుండా వెల్లడించారు.

చక్రాయుధం గురించి శర్మగారిచ్చిన వ్యాఖ్య నిరుపమానమైంది.

షోడశి-మహావిద్య 'షోడశి' అంటే సర్వ శుభ లక్షణ సంపన్నురాలై, నడియౌవనంలో ఉండే సుందరాంగి. అదే 'త్రిపురసుందరి' శ్రీ రామకృష్ణ పరమహంస శారదాదేవిని షోడశిగా ఆవాహనచేసి పూజించాడు. అదేరహస్యం-ఆ రహస్యాన్ని శర్మగారు ఈ 'షోడశి'లో 'షోడశి'గా వ్యాఖ్యానించారు.

రామాయణం భారతానికి మార్గదర్శి అని బలీయములైన ప్రమాణాలతో ధ్రువపరచి ఆధునా తనవాదాన్ని శర్మగారు త్రోసిపుచ్చిన పద్ధతి వారి పటిష్ఠ విమర్శ విధానానికి ప్రతీకగా వుంది.

మహర్షి నోటవచ్చిన మాట ఇంత బరువుగా పరువుగా వుంటుందని చూపడానికి శర్మగారు చేసిన కృషి మామూలు కృషికాదు. అసాధారణ మైన తపస్సుఅనే చెప్పాలి.

"మబ్బుల వలువలు విడిచి రాత్రి నగ్నంగా వెన్నెట్లో స్నానం చేస్తోంది; పూల నెత్తావులతో గాలి గుసగుస లాడుతోంది; నీవు వస్తావన్న నిరీక్షా మధువు చప్పరిస్తూ ఎద మత్తులో ఒత్తిగిల్లింది." (శేషజ్యోత్స్న)

"నిర్మలాకాశపు నీలాంటి రేవులో పండు వెన్నెల నీట పిండి ఆరేసిన తెలిమబ్బు వలువలు తేలి పోతున్నాయి. చిగురు గుబురులు దూరి చిరుగాలి బాలికలు రేరాణి పూలపై పారాణి రాచుకుని చిక్కటి నెత్తావి వుక్కిరిబిక్కిరిస్తున్నాయి." (పతులు)

**ఆచార్య డా॥ దివాకర్ల వెంకటావధాని.**

"సుప్రసిద్ధ కవి విమర్శకులైన శ్రీ శేషేంద్రశర్మ గారు షోడశిలో ప్రదర్శించిన ప్రజ్ఞా పాండితీ ప్రకర్షము నాన్యతోదర్శనీయము. తమ ప్రతిపాదనలను బలపరచుటకై వారు మంత్ర తంత్ర శాస్త్ర గ్రంథముల నుండియు దేవీ భాగవతము నుండియు నుద్ధరించిన శ్లోక వాక్యాదులు వారి పాండిత్యమును బహుగ్రంథ పరిశీలనమును, వ్యక్తము చేయుచు వారికి గల శేషేంద్ర నామమును సార్థకము చేయుచున్నవి..."

**స్వర్ణహంస:**

"నైషధము ప్రధానముగా ధ్వని కావ్యమనియు హర్షభట్టు వ్యాస వాల్మీక్యాదులవలె నాధ్యాత్మిక యోగ మంత్ర శాస్త్ర రహస్యముల నందు నిష్ణాతుడై యపార ప్రతిభ ప్రదర్శించెననియు శ్రీ శర్మ గారు నిర్ణయించినారు...వారితరులకు స్ఫురింపని

యెన్నో క్రొత్తవిషయములు చెప్పుదురు. వాని నన్నింటిని బహుగ్రంథములనుండి ప్రమాణముల నుద్ధరించి నిరూపింతురు. ఆ నిరూపణము చూచిన తర్వాత నెవ్వరైనను వారితో నేకీభవించి యూరకుండ వలసినదే తార్కికము సహేతుకమునైన వారి వాదమట్లుండును... వారు లలితా సహస్ర నామములు, మంత్రయోగశాస్త్ర గ్రంథములు, సౌందర్యలహరి, ఉపనిషత్తులు మున్నగు వానినుండి యెన్నో వాక్యము లుద్ధరించిరి. వారి కవి యన్నియు వాచావిధేయములు. వారి ప్రతిభ నవనవోన్మేషశాలి యైనది; విమర్శ నిశితమైనది; రచన ప్రౌఢ సుందరమైనది..."

"ఇది నా యెదపై విసిరివేసిన ఎర్రి గులాబీ! నీ మృదుపద విన్యాసాలకు నా తలపులు పూలు చాపగా పరచాను మెల్లగా రా!...కొమ్మల్లో నిదురించే కుసుమ సమూహాల పరిమళ నిశ్వాసాల్లో పరవశిస్తోంది నిశ్శబ్దం... కలలు కన్నిటిలో జలకాలాడుతున్నాయి ఈ మిగిలిన క్షణాలు కూడా రాలిపోక ముందే రా! నీ తెలి తామరపూ తనువును నా ఉచ్ఛ్వాస నిశ్వాసాల ఉయ్యేలలో ఊపుతాను" (శేషజ్యో)



షోడశి గ్రంథావిష్కరణ
సందర్భంలో
రిట్జ్ హోటల్లో
జరిగిన విందు
బి. కె. రావ్ I A S,
కె. వాసుదేవరావ్ I A S,
డా. బి రామరా.
డా ఆరిపిరాల విశ్వం,
శ్రీ నెమలికంటి
రామచంద్రరావు
ప్రభృతులు ఉన్నారు



అఖిలభారత తెలుగురచయితల మహాసభ (1968) రాజ్‌కుమారి ఇందిరాదేవి ధన్‌రాజ్‌గిర్, ఆర్. యస్. సుదర్శనం, శేషేంద్రశర్మ గార్లను చూడవచ్చును.

# అయిదో ప్రకరణము

## సాహిత్య కౌముది: మిశ్రకృతి :-

ధ్వని వాదంమీద ఒకానొకప్పుడు ఎక్కువ మక్కువ ఉండేది. ప్రస్తుతం రసధ్వనివాదం మీద "రసోవై సః" లో "సః" అని పుంలింగం వాడటం చేత ఇది సగుణ బ్రహ్మ పరమని అందుచేత బ్రహ్మా స్వాదతుల్యమని కొందరన్నారని అనుకొంటాను. లేకపోతే బ్రహ్మాస్వాదమే అని పలికేవారు. జగన్నాథుడు కూడా "భగ్నావరణాచిదేవ" అన్నాడుఆవరణ రహితమైన చిత్ ఏకైక రసము. అది. శాంతమని భావిస్తాను. శజ్జలానిత్ శాంత ఉపాసీత," "ఉపశాంతోయ మాత్మా" అనే శ్రుతులు ఉన్నవి.

రసధ్వని యొక్క వివర్త రూపము అభిధా. అభిధా వృత్తి లేనిదే రసధ్వని ప్రతీయమానం కాదు

గనుకనే అభిధావృత్తి నాశ్రయించి స్ఫోట వాదాన్ని వైయాకరణులు లేవదీసినారని అనుకొంటూను. ఈ దృక్పథంతో మూడవపేజీ సమర్థనీయం. ధ్వనిమథనం చక్కగా ఉన్నది. ప్రశంసనీయం.

తిక్కనపై చేసిన మీ విమర్శ గొప్పది. క్రొత్త విషయాలను చెప్పినారు. కీచకుడు వాచ్యంగానే కూలిపోయినాడని (పేజీ 31) అంటే హృద్యంగా ఉండేదేమో. విరాటపర్వం ధ్వనికావ్యమే. దానిని మీరు స్పష్టంగా తెలియజేశారు—సోదాహరణంగా. ధన్యుడీను సోమయాజి కావడంచేత పూర్వమీమాంసకుల అభిప్రాయమునే ధ్వనిగా పరిణమింపజేసి ఉండవచ్చునేమో!

నన్నయ (పేజీ 46) ధ్వనికావ్యం వ్రాయక పోవచ్చు. కాని ఆయన రచనలో ధ్వని లేదంటారా? నాకు మాత్రం చాలా స్థలాల్లో ధ్వని కనిపిస్తుంది. ధ్వనిని రసాంగగుణంగా చెప్పినాడనుకుంటాను ముఖ్యంగా సభాపర్వంలోను కొన్ని భాగాలలో ఆది పర్వములోను, "అభిహితంబైన శబ్దంబు అర్థమాత్ర కరణి" అని ఒకచోట ఉన్నట్లు జ్ఞాపకము. భాట్ట

మీమాంసకుల అభిహితాన్వయవాదాన్ని చక్కగా వాడినారు

రెండవ కవిత్రయంమీద చేసిన విమర్శ దుర్భేద్యంగా ఉన్నది. శృంగార నైషధమని, శృంగార శాకుంతలమని (పేజీ 65) పేర్కొనబడిన ఈ కవులకు మూలగ్రంథాలు సమగ్రంగా అర్థంకాలేదేమో అని తోస్తుంది. పేజీ 80లో చక్కని విమర్శ. ఆధునికులు అని స్పష్టంగా అనలేదుగాని, స్ఫురించింది.

శివకవులమీద విస్తృతంగా వ్రాస్తే నాలాంటి వారు విషయాలను తెలుసుకోగలరు.

మిశ్రకృతి :-

"చంపూవినోదిని" లోని ఆశుకవిత్వం అత్యంత రమణీయంగా ఉన్నది. మీరు వ్యంజనావాదులైనా రసపరంగా పద్యాలున్నవి. వృత్తాల పోకడ, సీసపద్యాలతీరు శ్రీనాథుని జ్ఞాపకం తెస్తున్నవి.

"మబ్బుల్లో దర్బారు" కొంతబాగానే ఉన్నదికాని Symbolism అంత పటిష్ఠంగా లేదేమో అనితోస్తుంది.

"విహ్వల"లో చివరి కథమాత్రం నచ్చలేదు. Propaganda గా ఉండటంచేత కావచ్చు.

## (Excerpts from letters)

"ఎంతో వ్యాప్తి ఎంతో వైవిధ్యమూ ఉండి కూడా హిందీ భాషలో ఓజస్సు ఉష్ణోగ్రత ప్రకాశము అనే మూడింటినీ ఒకేసారి ఇంత పరిమాణంలో ఇచ్చే మీ వంటి జాజ్వల్యమాన మైన కవిఎవరూ లేరు. నన్ను హిందీలో మోహినీ జ్వాలాకవి అని వర్ణిస్తారు. కానీ హృదయావర్జకంగా జ్వాలాజ్యోతుల దృశ్యా లను గీచే మీరే వాస్తవంగా మోహినీ జ్వాలాకవి."

(రామేశ్వర్ శుక్ల 'అంచల్'
సుప్రసిద్ధ హిందీ కవి)

"I heartily associate myself with the introductory volume ... yuga kavi seshendra ... I specially liked the article of Dr Kadernath Labh (Page xxxxv) the introduction of Smt. Indira Devi in Gorila and My conutry My People and her articles in yugakavi Seshendra are so illuminating that I am often reminded of Shelly She has not only given an intimate glimse of the creator in Seshendra but has given a critical appraisal of a high order so attached and yet so detached."

(Gulab khandelwal, Renowned Hindi
Poet, Gaya, Bihar)

"మీకృషి అమోఘము. ఇంతవరకు మీరు కేవలం కవులే అనే దురభిప్రాయమున్నది 'పాండిత్యహీనాః కవయో భవంతి' అన్నారు కదా! ఇప్పుడు మీరు కవులు మాత్రమే కారని, పండితులనీ, దార్శనికులనీ, అందుచేత 'ద్విత్రాః పంచషావా' అనే పంక్తికి ఇంకొక సంఖ్య చేర్చాలనీ భావిస్తున్నాను"

(Prof. P S. Sastri
Head of Englist Dept ,
Nagpur University)

# సాహిత్య కౌముది

**శ్రీ డా. కేతవరపు రామకోటిశాస్త్రి**
యం. ఏ. పి. హెచ్ డి.
రీడర్, ఆంధ్రశాఖ, ఉస్మానియా యూనివర్సిటీ
హైదరాబాదు.

మన ప్రాచీనాంధ్ర మహాకవుల కృతుల పరమార్థ రూపమైన ఆనంద సౌందర్యమును తాము దర్శించి పొందిన ప్రీతిని నీకును నాకును కల్గింప దలచి శ్రీ గుంటూరు శేషేంద్రశర్మ గారీ వ్యాసములను వ్రాసి ప్రకటించు చున్నారు. ఒక గ్రంథము ప్రకటింపబడినదనగా అది తద్విజ్ఞాన విషయ పరిధిని పెంచునదిగా నుండవలయును. ఉన్నదానిని వెలిగించునదిగా నుండవలయును. నూత్న మర్యాదాలంకృతమైన స్వతంత్ర పథమున దానిని ప్రపంచించి చూపునదిగా నుండవలయును. ఆ మాత్రము యోగ్యతలేని పుస్తకము ప్రకటింపగూడదు. ఈ గ్రంథమున ప్రతి పుటకును తాదృశమైన యోగ్యత కచ్చితముగా కలదు.

తత్త్వ మీమాంసపారము ముట్టిన తరువాత మన దేశమున కావ్య విద్యా విచారము మొదలయినది. అందువలన నిదియు నా మార్గమునే పట్టినది. అనగా మన సాహిత్య విద్యాతత్త్వ వేత్తృత్వ లక్షణము మన వేదాంత విద్యా తత్త్వ వేత్తృత్వ లక్షణముతో సంబంధించి యున్నది. ఈ విషయమెంత చెవి నిల్లుకట్టుకొని చెప్పినను బోధపడనంత దూరము కాల ప్రవాహము మనలను నెట్టుకొని వచ్చినది. మనకు మన ప్రాచీన కావ్యముల అర్థబోధ లేక పోవుటకుగల కొన్ని ముఖ్య కారణములలో నిదియు నొకటి. దేశీయములయిన మత తాత్త్విక విషయ విజ్ఞాన నిరపేక్షముగా ఆ దేశపు భాషా సాహిత్యముల యస్తిత్వమును భావించుట, అధ్యయనము చేయుట రెండును అనర్థహేతువులు. అందును మన దేశము భాషా సాహిత్యముల విషయమున అది అక్షరశః సత్యము. నేటి మన విద్యావిధానము తదితరమైన మార్గమునే మార్గముగా పాటించుచున్నది. కాని దాని అధికారము సాగుచున్న దినములలో అయినను దానిని నిలబెట్టుట కంద ఱును సమర్థులుకారు. అయినను ధైర్యము చేయరు.

శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారి యందు సమర్థత ధైర్యము రెండును పుష్కలముగా నున్నవి.

శబ్దబ్రహ్మోపాసకుడు పరబ్రహ్మ మహిత పదమును పొందునని స్యూమరశ్మికి కపిలుడు చెప్పినాడు శబ్ద బ్రహ్మ భజన సాధన. పరబ్రహ్మ మహిత పదస్థితి సాధ్యము. యోగమునకు సిద్ధులు కలవు. శబ్దమునకు అందచందములు గలవు. యోగసిద్ధులోకచో పరమార్థమునుండి యోగిని తొలగదీయునవియై యోగవిఘ్న కారణములయినట్లు ఒక స్థితిలో శబ్దము తన సొగసుందనముచేత సహృదయమునకు తాత్పర్యాప్తి విషయమున విఘ్నకారిగా పరిణమించు ప్రమాదమున్నది. ఆ ప్రమాదమును దాటినవారే మహాకవులును, పరమ సహృదయులును. చాలమంది దాటలేరు మహాకవుల సంఖ్య వ్రేళ్ళమీద లెక్కపెట్టుటకు తదినగిగా నుండుటకును, అసలు సహృదయులు సుదుర్లభులగుటకును అదియే హేతువు. మరియొక విధముగా చూచినచో కవుల సంఖ్య ఇంత ఎక్కువగా కనిపించుటకు కూడా తత్సౌందర్యమే కొద్దిపాటియో వారివారి ముఖముల ప్రతిభాసించుటయే హేతువు. వీరందరును

భాషా కవులు తెలుగున మహాకవులకంటే భాషా కవులు బలవంతులు. వీరికి పలుకుబడి యెక్కువ. ఈ భాషా కవిత్వ మాంధ్రమున శ్రీనాథునితో అవతరించింది.

శ్రీనాథుడు ఆంధ్ర సాహిత్య లోకమున జగన్మోహిని అవతారము, ఈ మాటను శ్రీ శేషేంద్రశర్మగారు తప్ప మరెవ్వరును ఇప్పటికి కనలేదు. సర్వ సమ్మోహినియైన వాగ్దేవిని, వైఖరీ శక్తి వ్యక్తిని శ్రీనాథ ముఖావిర్భూతను చూచి ఇంతగా సమాకృష్టు లయినవారు మరొకరు లేరు. గనుక ఆ మాట ఇంతవరకు పుట్టి యుండలేదని పించుచున్నది

జగన్మోహిని యేమి చేసినది? ఊరక ఊరించినది. ఉబ్బించినది. వెంటబడ జేసికొనినది. చివరకు వట్టి చేతులతో పంపించినది. చాలమంది కదియే గతి. శ్రీనాథ భారతీసౌందర్య సమాకృష్టుల స్థితియునదియే. "ఏమియును ఉండదు. ఎంతో ఉన్నట్లు కనిపించును. అది చిత్తమును మోహా క్రాంతమును జేయును." ఈ మాట చెప్పి శ్రీ శేషేంద్రశర్మ గారు ఏతద్దశా విశేష మూలములను తండోపతండ

ములుగా త్రవ్వి పోసిరి. మాతృకాశక్తి సౌందర్య మును శ్రద్ధ కలిమిని దర్శించి ప్రకటించిన శ్రీ శర్మ గారు యోగ్యమైన పని చేసినారని చెప్పవలయును

మహాసౌందర్యవంతములయిన శబ్దములు ఏక తాత్పర్యాభిముఖములై ఒదిగినవి, వాక్యములుగాను పద్యములుగాను అగుచున్నవి. తాదృశమైన పద్య రచనా విధానమొక విద్య. ఒక శిల్పము ఈ శిల్ప విన్యాస లక్షణమును తిక్కన శ్రీనాథుడు, పెద్దన, మంచన, జక్కన, రామకృష్ణుడు, జగ్గకవి-పినవీర భద్రుడు, గోపరాజు, రామరాజ భూషణుడు - నాచన సోముడు - ఎఱ్ఱన మొదలైన కవుల కృతు లలో నున్నవానిని చూచి వానిని ఒకరొకరినిబట్టి ఒక రెట్లనుసరించి పెంచిరో శ్రీ శేషేంద్రశర్మగారు నిరూపించుట వారి బహుగ్రంథ పఠనమునకును, తదాత్మను పసికట్టుటకును నిదర్శనములు.

ఇంతకంటెను వారి స్వతంత్ర దర్శనమును నిరూపించు వ్యాసము రెండవ కవిత్రయము. శ్రీ శర్మగారు పద్యముల నుదాహరించుట కావ్యముల నాపోశన మెత్తినట్లుండును. నిజముగా శ్రీ శర్మ గారు చెప్పినట్లు రెండవ కవిత్రయము జక్కన, శ్రీనాథుడు, పినవీరభద్రుడు. తిరిగి జాగ్రత్తగా పఠించి అర్థము చేసికొని విలువకట్ట దగియున్నారు.

శివకవులకు పోటీగా హరిహరకవులను ఎన్ని నిలబెట్టుటయు చమత్కారముగా నున్నది. ఇదియు మరొకరుచేయనిది.

తిక్కన సోమయాజి ఏకైక ధ్వని కావ్యప్రణేత అన్నది అంత సులభముగా ఆంగీకరింప దగినదికాదు. శ్రీ శర్మగారి ఉదాహరణములు - వివరణములు అంగీకరింపజేయు ప్రయత్నము మాత్రము, చక్కగా జేసినవి. ఆంధ్ర సాహిత్యంలో హాస్యరసం అను వ్యాసము సత్య విషయ కథనముతో నిండుగానున్నది. రామాయణ మావిర్భవించిన విధమును విలక్షణముగా సమన్వయముచేసి చూపిన వ్యాసము "మంచి పుస్తకాలు" అన్నది. విశిష్టమయ వివేచన ప్రధానముగా నున్న దన్నిటికంటెను చివరి వ్యాసము.

నిజమునకు శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారిని గూర్చి ఎవరును ఏమియు చెప్పనక్కరలేదు. ఆయన రచనలే ఆయనను గురించి చక్కగా చెప్పగలవు. అది పరచయితను గూర్చియైనను అట్లే యుండును. మిత్రులు శ్రీ శర్మగారిని అభినందించుచున్నాను. ఆంధ్ర సాహిత్య విమర్శనాధ్వము నాయన వెలిగించుగాక యని కోరుచున్నాను.

# 'స్వర్ణహంస'

—డా॥ సుప్రసన్నాచార్య

తెలుగు సాహిత్య విమర్శ ఇటీవల చాలా మార్పులు పొందుతున్నది, మన సాహిత్యములో విమర్శ పూర్వగ్రంథాలకు పీఠికలతో ఆరంభమైంది కవుల చరిత్రలలో దీనికి మరికొంత వికాసం వచ్చింది.

ఈ మధ్య వెలువడ్డ ఉత్తమ విమర్శా గ్రంథా లలో శ్రీ గుంటూరు శేషేంద్ర శర్మగారి షోడశి: రామాయణ రహస్యములు, 'స్వర్ణహంస' అనేవి పేర్కొనదగ్గ గ్రంథాలు. ఈ గ్రంథాలు రెండూ అపూర్వమైన కావ్య రహస్యములను సహృదయ రంజకంగా నూతనదిశలో వ్యాఖ్యానం చేసినవి.

స్వర్ణహంస అన్న గ్రంథం భట్ట హర్షుని నైషధ కావ్యం గూర్చిన విమర్శ. ఈ గ్రంథంలో శర్మ గారు ఆ కావ్యంయొక్క సౌందర్యాన్ని అనితర

పూర్వంగా వ్యాఖ్యానం చేసినారు; సంస్కృత కావ్యవాఙ్మయంలో నైషధం కావ్యశిల్పం పరాకాష్ఠ పొందిన గ్రంథం ఈ కావ్య సౌందర్యానికి ముగ్ధులైన సహృదయులకోసం దాదాపు అరవై వ్యాఖ్యానాలు వెలువడ్డవి. ఈ కావ్య ప్రాబల్యం తరువాత సంస్కృతకావ్య రచనపైన కానవస్తుంది. తెలుగులో ప్రబంధమార్గానికి ఆదర్శం నైషధమే, శ్రీనాథుడు నైషధాన్ని ఆంధ్రీకరించి తరువాత వెలసిన ప్రబంధ వాఙ్మయశాఖకు మూలసూత్రమును సమకూర్చినాడు.

శ్రీ శేషేంద్రశర్మగారి విమర్శ కథాపరమార్థ దర్శనాభిముఖముగా ప్రవర్తించి తెలుగు పాఠకులకు అపూర్వరహస్యముల వెలికిదీసి యిచ్చినది.

వ్యాసుడు భారతములో సూత్రప్రాయముగా చెప్పిన వేదాంత గర్భితమైన గాధను, శ్రీహర్షుడు సాధారణ కావ్యసౌందర్య సముద్ధరణముగా కాక గూఢముగా యోగవేదాంత మంత్రశాస్త్ర మర్మములతో సంకలితముచేసి రచించినాడు. ఇటు నన్నయగానీ, అటు శ్రీనాథుడుగానీ ఈ పర

మార్గమువైపు దృష్టి సారించలేదని శ్రీ క్షేమేంద్ర శర్మగారు సోపపత్తికముగా వ్యాఖ్యానించినారు.

నైషధ రచనలో కావ్య సామాన్యార్థము ఒక పొర. రెండవ పొర ఈ పరమార్థమునకు సంబంధించినది ఈ రెండుపొరలూ ఒకదాని క్రింద వేరొకటిగా అపూర్వముగా అనుసంధింపబడి యున్నవి. శర్మగారి కృషివల్ల ఈ రెండవపొర ప్రకాశమానమైనది.

ఈ గ్రంథములో మొదటి అధ్యాయమున శర్మగారు ధ్వని సిద్ధాంతమును స్వోపజ్ఞముగా వ్యాఖ్యానించినారు. తాము చెప్పబోవు అపూర్వమైన విషయము లన్నియు ధ్వనులేయనియు ఇది ధ్వని కావ్యమని చెప్పుచు దానికి ఉపోద్ఘాతముగా ధ్వని మథనము, వ్రాసినారు. రసము ధ్వని ఈ రెండును శివశక్తుల వంటివని ధ్వని విరహితమైన రసము ఆస్వాద్యత్వ లక్షణ శూన్యావస్థలో ఉండునని వ్యాఖ్యానించినారు. ఈ అధ్యాయమున అలంకారశాస్త్ర పరమార్థమును గూర్చి శర్మగారు ప్రతిభతో చర్చ చేశారు రసము పరమార్థమూ ధ్వని సాధనమని రసమెప్పుడూ వాచ్యముకాదని నిరూపించినారు,

ఈ అధ్యాయములో పరమ ఉత్కంఠతో శ్రీ శర్మగారు రసము ధ్వని ఈ రెండూ అనిర్వచనీయములనీ పరబ్రహ్మ స్వరూపములనీ వ్యాఖ్యానించినారు. కావ్యతత్త్వవేత్తలు జాగ్రత్తగా పరిశీలించవలసిందీ అధ్యాయం.

తరువాత ఏడధ్యాయాలు నైషధమునుగూర్చిన విమర్శ, ఇంతకు పూర్వము చర్చితములైన వర్ణనాలంకారాది సాధారణ కావ్య సౌందర్య వివేచన శర్మగారు చేయలేదు. ఆయన ప్రతిపాదించ దలచిన పరమార్థాన్ని సూటిగా ప్రతిపాదించారు.

సామాన్యంగా నూత్న విషయాలు ప్రతిపాదించే ఉత్కంఠకలవారు కార్య కారణనిరూపణలో అంతగా శ్రద్ధవహించరు. కాని అట్టి విమర్శ గాలిలో దీపంపెట్టినట్లు, నేలవిడిచి సాముచేసినట్లు ఉంటుంది. శ్రీ శర్మగారు ప్రతిపద్యాంశమును సమర్థించుటకు ఉపనిషత్తులు, యోగ గ్రంథములు, తంత్ర గ్రంథముల నుండి అనేకధా ఉటంకింపుతారు, అందువల్ల ఆయన చెప్పే విషయం ప్రత్యాఖ్యానానికి వీలుగా ఉండదు. ఒకొక్కచోట సమన్వయం కుదరని

చోట ఆ విషయం కూడా దాటవేయకుండా స్పష్టంగా చెప్పడం ఆయన చేస్తారు. 78వ పుటలో హంస కుండినపుర ప్రయాణ వర్ణనమును హంస (జీవుడు) షట్చక్ర గమనం చేయడంగా సోపపత్తికంగా వ్యాఖ్యానిస్తూ- "ఫలమైత్రీష్ట రసాల పంగతమ్'' అను శ్లోకమున మణిపురమును "విట పచ్ఛన్న తరతుపం నగం'' అను శ్లోకమున అనాహతమును కవి ఉద్దేశించి యుండును. ఎట్టి విషయమును ఇందు నిక్షేపించి యున్నాడను గ్రంథిని విడదీయుట మిక్కిలి దుర్ఘటముగా నున్నది. కవి ఇట్టి సందర్భములందు ప్రయోగించు సంప్రదాయ పద్ధతుల నెన్నింటినో శోధించితిని కాని ఫలితము లేక పోయెను. అని స్పష్టముగా పేర్కొన్నారు.పూర్వోత్తర సందర్భము ననుసరించి శర్మగారు చెప్పిన అర్థము సుసంగతం అయినా అక్కడ దాని స్పష్టమైన స్ఫూర్తికి హేతువు లభించక పోవడాన్ని అంగీకరించినారు.

భారతంలోని నలోపాఖ్యానములోనే శ్రీహర్షుని కావ్య ధ్వనికి ఆధారాలున్నవి. కాని నన్నయగారి

అనువాదంలో ఈ రహస్యాలు ప్రకటితం కాలేదు. వ్యాసుడు 'సాక్షాదివ స్థితమ్ మూర్త్యా మన్మథమ్ రూపసంపదా" అనగా శ్రీహర్షుడు కూడా కందర్ప ఇవ రూపేణ మూర్తిమాన్ అన్నారు. నలుడు జీవుడేకాక కందర్పుడు కూడా. 'కందర్పుడు ఉపాసకులలో అగ్రేసరుడు. శ్రీ శర్మగారు ఈ విషయాన్ని సమర్థిస్తూ లలితా సహస్ర నామావళిలో నుండి ప్రమాణాలు చూపి శ్రీ విద్యకు కందర్ప విద్య అని పేరనీ, కందర్పుడు ఆ మంత్ర ద్రష్టనీ సమన్వ యిస్తారు.

ఈ గ్రంథంలో ధ్వని విశేషాన్ని వ్యాఖ్యానిస్తూ సంకేతాలను వివరిస్తూ శ్రీ శర్మగారు లలితాసహస్ర నామావళి, సౌందర్యలహరి, కామ కళా విలాసము మొదలైన అనేక తంత్ర శాస్త్ర గ్రంథాల నుండి ఉదాహరణాలు ఇస్తూ వుంటారు.

నైషధ విమర్శ శ్రీ శర్మగారు చేసిన నూతన వాఖ్య పూర్తిగా సోప పత్తికంగా ఉన్నది.

# Sahitya Kaumudi

ANDHRA VISWA SAHITI: (Hyderabad)

Till over a hundred or two hundred years ago, we had no literary criticism in Telugu, evaluating the worth of various literary works and assigning correct places to them in the order of literary merit. Perhaps Somakavi's commentary to Vasucharithra is the first of its kind and may be treated as prelude to the branch of literary criticism that appeared in Telugu long after. The absence of literary criticism for centuries in Andhra has led to wrong placement of Poets and their works in the order of literary merit and with the era of masterminds coming to a close and mediocrity beginning to control the literary scene, accurate appreciation of the poets and their contribution to the wealth of Telugu Literature has been deplorably wanting.

In the present work, the author attempts to point out the places of various poets in Telugu Literature and emphasize the need to rehabilitate poets like Jakkana and Pinavirana. In the course, he thows out the idea that there is a second trio in Telugu literature besides the first

trio Nanuaya, Tikkana and Errana. They are, he points out. Srinada. Jakkana and Pinavirana each having his counterpart correspondingly in the first trio. The climax of Telugu poetry was reached in thc so-called prabandha period. and all the excellences disaplayed by the various poet s of the period are to be ultimately traced to the second trio and most notably to Pinavirana among them. The process of evolution of various patterns of style in each verse as traced by the author in several poets is a very interesting study never attempted before.

From out of this plethora of various styles of versification emerges the master idea of deducing principles of versification and codifying them into a science to be calld Padya Silpa Sastra, the author points out. All this is covered in the second and third articles of this book.

In the first article, in a masterly analysis of the causes of Srinadha's grandeur, he points out the truth that Teleugu, though handled by Nannaya, Tikkana, Errana and others, by that time did not acquire maturity in literary diction, It was not still qualified for handling literary work. Telugu acqnired ability to produce literary beauty only in the hands of Srinadha and that is his out-standing contribution to literature in Telugu. The way how common-place words

acquire literary style in Srinadha is abundantly illustrated in this article.

According to Sanskrit rhetoricians, style of literary diction and versification, though render beauty to literay works, are still only of lower order, and it is only what may be called poetic suggestion 'Dhwani' that is the real life-breath of a truly literary work of art. This theory rules the field of Sanskrit literature and the fields of various regional la guages in Inda. The beauties of great poets like Valmiki and Kalidasa are traced to this source only. But quite surprisingly in Telugu there are few poems which can be said to follow this principle of literary science. By and large it is the fashion of stylish diction called 'Reethi' that dominates Telugu Literary scene However we find poetic suggestion chiefly followed in Tikkana (that too prominently in Virata Parva) : Tenali Ramakrishna also appears to be a votary of the school of poetic suggestion as colud be seen from his poem Panduranga Mahathmyam. This is covered by the fifth article which strikes a novel note about the genius of Tikknna.

In the fourth article the author attempts to reconstruct the full personality of Tikkana Somayaji and truly points out, that Tikkana, respected by kings, poets and people, visiting royal courts

and conquering exponents of rival schools of philosophy in logistic dialogues and establishing Manumasiddhi on throne aud Adwaitha in Andhra, is a Mahapurusha and leader of a philosophical movement as opposed to the Virasaiva which was sweeping the country by violence at the time. So the author points out that Tikkana was not merely a poet but the Pope of South India in the days when he lived. The author throws out a ticklish proposition that the numerous poets that followed Tikkana down the ages after him are to be denominated as Harihara Kavulu as against the Sivakavulu that come before and after him.

Of the the other two articles, one is an interesting skit about good books and how and why they are written with a novel interpretation of the episode of Valmiki taking up the story of Rama: and the other article, a brief but very interesting survey of Kannada literature and its links with Telugu literary traditions.

The work "Sahitya Kaumudi" is full of flashes of original thought and scholarship and replete with enchanting literary prose and is without doubt an invaluable contribution to the modern literary criticism in Telugu.

# షోడశి

## కవిసామ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ

ఈ గ్రంథము పేరు "షోడశి". ఈ పేరు శ్రీవిద్యకు సంబంధించినది. ఇదియొక మహా మంత్రము. గొప్పవిద్య. ఈరచయిత తన గ్రంథము నందు ప్రధానముగా సుందరకాండ వ్యాఖ్యతో శ్రీ విద్యా విషయమును పేర్కొనుటచేత దాని యందలి యభిమానముచేత నీ గ్రంథమునకు షోడశి యని నామకరణము చేసి యుండును. ఒక గ్రంథ కర్త తానొక గ్రంథమును వ్రాసి దానిలో పదునే నధ్యాయములుండుటచేత దానికి పంచదశియని పేరు పెట్టవచ్చును. పంచదశి విద్యారణ్యముని కృత గ్రంథమందు రూఢమైనది. అట్లే షోడశియు. ఇది యోగమునందు తీసికొన వలయును. ఈగ్రంథము నందు పదునారధ్యాయములు కలవో, చివరనున్న "యాసృష్టిః స్రష్టురాద్యా" యన్నది తీసివేసినచో పదునారు భాగములు కావచ్చును. కాని ఆ శ్లోక ములో గూడ శ్రీ విద్యా ప్రస్తావనయే యున్నది.

ఈ గ్రంథములో ప్రధానముగా వాల్మీకి రామా యణము తదనుబంధిగా వ్యాసభారతము; రామా

యణ మధికముగా భారతమల్పముగా పరామర్శింప బడినవి

తొలుత "యాసృష్టిః స్రష్టురాద్యా"యన్న ఈ గ్రంథములోని చివరి యధ్యాయమును గూర్చిచెప్పి తరువాత గ్రంథమునకు వత్తును. ఆ శ్లోక వ్యాఖ్యా నము నమ్మవారి పరముగా శర్మగారు వ్యాఖ్యానము చేసిరి. వ్యాఖ్యానముచాల బాగుగా నున్నది. "శివః" అన్న శబ్దము పుంలింగము. అయినను విశేషణ విశే ష్యములకు తత్రతత్ర భిన్న లింగత్వము యొక్క కలిమిని వీరు తగినట్లుగా నిరూపించిరి. దీనిని "నిగమా గమ" సంప్రదాయమని చెప్పుచున్నారు. న్యాయ ముగనే యున్నది. శివశక్తులకభేద ప్రతిపత్తి గనుక మరియు శివుడు శక్తి యొక్క ప్రతిబింబము గనుక శివశక్తులిద్దరు నన్యోన్య ప్రతిబింబములు.

ఇంక ప్రధాన గ్రంథములో బహు విషయము లున్నవి. ఒకటి కాదు. ఏది ఎట్లున్నను శ్రీ శర్మ గారు చేసిన పరిశోధనగాని వారి మేధావిశేషము గాని ఆశ్చర్య జనకములుగానున్న వనుటకు సందే హము లేదు ఆశ్చర్యములలో నాశ్చర్య మేమనగా భారతము రామాయణమునకు ప్రతిబింబమని చేసిన ప్రతిపాదన. సంపూర్ణముగా ప్రతిబింబము కాకపోయి

నను శ్రీశర్మగారుచూపించిన స్థలములలోని ప్రతిబింబ త్వమునా కావచ్చు పుట్టించినవి. శ్లోకములు శ్లోకములు చరణములు చరణములు వానియంతట వానినే భగవం తుడైన వ్యాసుడు వాడుకొనెను. తాకికమైన సంస్కృతభాష యంతయు వాల్మీకి చేసి పెట్టినదే! అందుకనియే కల్పవృక్షములో "ఈసంసార మిదెన్ని జన్మలకు నేని మౌని వాల్మీకి భాషా సంక్రాంత ఋణమ్ము దీర్పగలదా?" అని వ్రాయబడినది. వాల్మీకిని యథేచ్ఛముగా వాడుకొన్న వారిలో మొదటి వాడు వ్యాసుడు. అంతకంటె విశేషమేమియు లేదు. ఇంక తరువాతి వారి మాటచెప్పుట యెందుకు? ఈ భాగము చదువు చుండగా నెవరైన నాశ్చర్య పోదురు. వారుకూడ రెండు గ్రంథములను దగ్గర పెట్టుకొని శ్రీ శర్మగారివలె పోల్చి చూచిన వారైనచో వారి బుద్ధి విశేషము మెచ్చుకొన వలసినదే.

ఇంక తరువాత రెండు విషయములకు నీగ్రంథము నందు గొప్ప ప్రాధాన్యముగలదు. ఈ గ్రంథము యొక్క వ్రాయవలసిన యవసరము: ఆ రెండు విష యములే. తక్కిన వనుసరించి వచ్చిన వనవలెను. ఈ రెండు విషయములలో మొదటిది సుందరకాండకు సుందరకాండయను పేరువచ్చుట. సుందరకాండము

నందు కుండలినీ విద్య ప్రతిపాదింపబడినదని చెప్పుట. రెండవది త్రిజటా స్వప్నము. వీనిని గురించి చెప్పుటకు పూర్వము వీనిని గురించిన ఈ రహస్యములు వీరు చూపించి ఋజువు చేసిన యాధిక్యము వీరికున్నదిగాని తన్మూలల విషయము పండితులయొక్క ప్రవాదములో నుండనేయున్నది. సుందర కాండము నందు గాయత్రీ మంత్రము నిక్షేపింపబడి యున్నదని పండితులైనవారు శ్రీ మద్రామాయణము నందభిమానము కలవారు చెప్పికొనుట యున్నది. ఇది క్రొత్తగాదు. ఎక్కడ నున్నది? ఎట్లున్నది? అన్నవియే ప్రశ్నలు. సుందర కాండము పారాయణము చేయువారు దినమున కేడు సర్గలుగా పారాయణము చేయుదురు. గాయత్రీ మంత్రము లోని యర్థముగాని యా యక్షరములుగాని యీ యేడింట కొంత కొంతగాని యొక్కటొక్కటిగాని నిక్షేపింపబడినవేమో పరిశీలించి యట్లున్నచో తెలిపినివారు నాకు తెలిసినంతవరకింతకు ముందులేరు. నేనొకప్పుడు సుందర కాండమునందు గాయత్రీ మంత్రాక్షరముల కొరకు వెదకితిని. ఓపికతో గూడిన యిట్టిపనికి నేను చాలను. ఉన్నవేమో? నాకు కనిపించలేదు. అట్టివి నాకు కనిపించవు.

శ్రీ శర్మగారు త్రిజటా స్వప్నమును గాయత్రీ మంత్రములోని పాదముల సంఖ్యయు నక్షరముల సంఖ్యయు తీసికొని అది గాయత్రీ మంత్రమునకు నొక విధమైన వ్యాఖ్యయని నిరూపించుట మిక్కిలి యూహాస్ఫోరకముగా నున్నది; వారి శ్రద్ధను నిరూపించు చున్నది. ఇది పారాయణము చేయు నెంచెడి వారికి శ్రీ శర్మగారు చేసిన యుపకార మింతయని చెప్పరాదు,

ఒక గ్రంథకర్త ఒక మహా విషయమును వ్రాయును. సహజముగా నతడెంత గొప్పపని చేసెనని పరులు ప్రశంసింప వలెనని యతనిక దుట వాడెంత గ్రంథకర్తయైనను జీవలక్షణము. ప్రశంసించెడి వారు గూడనెట్లు ప్రశంసింతురు. పెదవితో ప్రశంసింతురు. నిజముగా బ్రశంసించెడి వాడెవడనగా త్రిజటా స్వప్నములోని యీ రహస్యమును తెలిసి కొని దానిని ప్రధానముగా తన పారాయణములో పెట్టుకొనెడి వాడు.

ఇంక మొదటిది. సుందరకాండ విషయము. అమ్మవారు సౌందర్యనిధి. సౌందర్య నిధి కాదు, ఆమెయే సౌందర్యము. శ్రీ దీప్తి హ్రీ శాంత్యాది శబ్దముల యొక్క యర్థము దేవి యందు పర్యవ

పించునట్లు సౌందర్యమనగా దేవి-అందుచేత ఈకాండ మునకు సుందర కాండమని పేరు వచ్చినదని శ్రీ శర్మగారి ప్రతిపాదన. ఇది యొక వ్యాఖ్యానము. ఇష్టాపత్తి కలుగవలసిన విషయమే. కాని కాదను టకు వీలులేదు కదా. ఎందుచేత ననగా సుందర కాండ మంతయు కుండలినీ యోగమని నిరూపించి నారుగదా.

రామాయణమునందు తక్కిన కాండలకు తత్త త్కాండాంతర్గత కథా సూచకములైన నామము లుండగా దీనికి సుందరకాండ మన్న పేరు విడిగా నేల పెట్ట వలసి వచ్చెనన్న ప్రశ్న నిచ్చలు వినిపించు నదియే. ఈ సందియము పలుమందికి కలదు. నేనొక సారి నేటికి ముప్పది యేండ్ల క్రింద కావచ్చును. క్రీ.శే.పూజ్యులైన శ్రీ కాశీ కృష్ణాచార్యుల వారిని ఈ కాండమునకు సుందరకాండ మను పేరెందుకు వచ్చినదని అడిగితిని. వారిట్లు సమాధానము చెప్పిరి, సుందరహనుమన్మంత్రమని యొకటున్నది. ఆ మంత్రమును మహర్షి యాకాండమున నిక్షేపించెను. అందుచేత దానికి సుందర కాండమని పేరు వచ్చి నది.'' అనగా నేను "మూలమంత్ర మేమి? అంగ న్యాస కరన్యాసములేమి? ధ్యాన శ్లోక మేమి?

మొదలగునవి యడుగలేదు. అప్పుడడుగుటకు వీలైన సమయముగాదు ఇద్దరము రైలు రాలేదని ఎదురు చూచుచు నిడుదవోలు ప్లాటు ఫారము మీద కూర్చున్న సమయము. నేనుపోయి వారిని సంగతి తరువాత యడుగలేదు. మహా మంత్రముల యొక్క నిరూపణము కలిగిన కొన్ని గంథములు కలవు. వానిలో నున్నదేమో? నేనా గంథములను చూడలేదు-నేను కొన్ని తంత్ర గ్రంథములను చూచితిని. వానిలో నిది కన్పించలేదు.

ఇది యట్లుండగా నెవరో చెప్పిన మాటయొకటి యున్నది. ఈ మాటను మరికొందరు గూడ ననగా నేను వింటిని. హనుమంతులకు హనుమంతుడు ఆంజనేయుడు మారుతి మొదలైన నామములు వాడుకగా వచ్చినవి. తల్లి పేరును బట్టి తండ్రి పేరునుబట్టి వజ్రఘాతమును బట్టి వచ్చినవి. కాని తల్లియైన యంజనాదేవి తన కొడుకునకు తాను పెట్టుకొనినపేరేమి? అర్జునునకు పది పేర్లున్నవి. అర్జునుడో కృష్ణుడో అయి ఉండవలెను. ద్రౌపది యొక్క అసలు పేరు కృష్ణ. భగవంతుడైన వ్యాసుని అసలు పేరు కృష్ణుడు. అట్లే ఆంజనేయుల వారికి తల్లిపెట్టిన పేరు సుందరుడు. ఇది వాల్మీకి

చెప్పెనా ? చెప్పెను. ఇట్లు చెప్పలేదు. ఆ మహర్షి తాను చాల పరమ గూఢమైన రచన చేయును. శూర్పణఖకు శూర్పణఖ యన్న పేరు బిరుద నామము. ఆమె యొక్క అసలు పేరు బాల. బాల యనగా మూర్ఖురాలని గూడ యర్థము చెప్ప వచ్చును. "బాలుడు వెర్రి బ్రాహ్మణుడు బ్రాహ్మణు కైవడి నుండ మాని" అని పోతన్నగారు. "పాలిత దుర్నయుండు శిశుపాలుడు బాలుడు" అని నన్నయ్యగారు. అట్టి సందర్భములో నున్న ఈబాలా శబ్దము శూర్పణఖయన్న నిజమైన పేరనుటకు నితర ప్రతి పత్తులే సహాయము కావలెను. అట్లే సుందర శబ్దముకూడ. ఇచ్చట నా ప్రతిపత్తులను నేను చూపించనేల వలయును? అది వేరు విషయము.

ఒక బుద్ధిమంతుడు తన మేధాశక్తిచేత సోపపత్తికముగా మహా విషయమని చెప్పికోదగిన దానిని వ్రాసినచో దానిని ప్రశంసింపవలయును. దానిని జూచి యానందింపవలయును గాని వెక్కిరించుట మిక్కిలి తేలిక. మీరు చెప్పిన యుపపత్తులు బాగుగా నున్నవి. సమంజముగా నున్నవి. అన్నిటి కంటె ప్రధానమైన యుపపత్తి సుందరకాండ మంతయు కుండలినీ యోగమని నిరూపించుటయే. ఈ నిరూ

పణ మాత్ర మాశ్చర్య జనకముగా నున్నది. శ్రీ శర్మగారు దీని నూరకయే నిరూపించలేదు. గాలిలో దీపము పెట్టి దేవుడా నీ మహిమయనలేదు.

శ్రీ శర్మగారు రామాయణము ఇంద్ర పారమ్యమును బోధించు గ్రంథమని యొక యధ్యాయమును వ్రాసిరి. వారు వ్రాసిన దాని తాత్పర్యము పౌనః పున్యమున నింద్రుడే సర్వాధి దేవతగా చెప్పబడుటయు అన్నియుపమానములు నింద్రునితోడనే చేయబడుటగా నున్నది. ఇట్టి పట్టులందు భగవంతుడైన శ్రీశంకరా చార్యులవారు తాత్పర్య నిర్ణయ హేతుకములైన మార్గములను తమ భాష్యము ద్వారా నిరూపించిరి ఇచట తాత్పర్య సిద్ధియెట్లనగా రామాయణమునం దింద్రశబ్దము వంద చోట్ల వచ్చినదందము. అన్ని ఇంద్ర శబ్దములు స్వర్గాధిపతియైన వాని గురించియే అని చెప్పుటకు వీలులేదు. వేదములందు గూడ ఇంద్రునకు సంబంధించిన కొన్ని ఋుక్కులతో కొన్ని మంత్రములలో నచట చెప్పబడినది స్వర్గాధిపతి కాదని తెలియును. ఇంద్రుడు వేరు విష్ణువు వేరు. విష్ణువు పలుచోట్ల నింద్రశబ్దము చేత చెప్పబడును. ఇంద్రుడు విష్ణు శబ్దముచేత చెప్పబడడు కాని వాల్మీకి వేదమునను సరించి శ్రీరామా

యణము వ్రాసెననుట న్యాయమే అనిపించును. ఇది యొక పెద్ద గొడవ ఇది నిరూపించుటకు నాకు శ్రీ శర్మగారి కున్నంత యోపికలో సగమైన నుండవలయును. నాకు లేనిదే అది.

ఇంకొక విషయము చూచినచో కొన్ని సంగతులు విస్పష్టముకాగలవు. ఈ గ్రంథములో నున్నవి రెండు వందల యరువది పుటలు. అందులో నరువది పుటలు భారతముకంటె రామాయణమే అధునాతనము అన్న సిద్ధాంత తిరస్కారము కొరకు వ్రాయబడినవి. తండ్రికి తాత పుట్టెనా? తాతకు తండ్రి పుట్టెనా? అన్న ప్రశ్నవలెనున్నది. ఇట్టి ప్రశ్నకెవడు సమాధానము చెప్పును? న్యాయస్థానములో నభియోగము పుట్టి రాజకీయపు కాగితముల కొరకు జిల్లా అధికారి రాజకీయ భవనము నందు వంశ వృక్షముల కొరకు వెదికెడి వానికి పట్టును. పనిలేని మంగలి పిల్లి తల గొరిగెనన్నట్లు వాదించెడి వారి కొరకు ఇంత శ్రమ యెందులకు? పాశ్చాత్యుల యొక్క దుర్మేధ నుండి పుట్టిన యనేక సందేహములలో- ఆ సందేహములు వేలు - ఇది యొకటి.

శ్రీ శర్మగారే "రామాయణము భారతమున

కంటె అధునాతనమను వాదము" అన్న శీర్షికతో నిందులో నేడు పుటలతో ప్రారంభించిరి. ఆ ప్రారంభమునందొక పుటయంతయు పాశ్చాత్యులు మన గ్రంథముల నెట్లర్థముచేసి కొనలేరో వ్రాయబడినది. బ్రహ్మల సంఖ్యయే చాల యున్నది. వ్యాసుల సంఖ్య వారిపేర్ల తో సహా యిరువది యెనిమిది యున్నది. ఒక్కొక్క మహాయుగమున కొక్కొక్క వ్యాసుడు. మన సంప్రదాయము ప్రకారము మనకు నేడు లభించుచున్న వాల్మీకిరామాయణము ఈ మహాయుగములో వ్రాయబడినది కాదు. వెనుకటి మహాయుగములో త్రేతాంతమున వ్రాయబడినది. నేటికి (1-10-67) నలుబది యేండ్ల క్రింద నిప్రసక్తి బందరులో నొక జ్యోతిష్కునివద్ద వచ్చినిది. ఆయన ఈ రామాయణము పూర్వ మహాయుగ త్రేతాంతమునందే వ్రాయబడినదనిచెప్పి యొక విషయమును చెప్పినాడు. తక్కిన శాస్త్ర గ్రంథము లెట్లున్నను భారత రామాయణముల కాల నిర్ణయము మాత్రము నీ నేటి సాహిత్య విమర్శ విమర్శ సూత్రములైన లోపలి వెలిసాక్ష్యములతో పొసగెడివి కావు. వెలి సాక్ష్యము మన సంప్రదాయము; దీనిని నీవు నిరాకరింతువు. లోపలి సాక్ష్యము కావ్యములలో చెప్ప బడిన విషయము ఈ సాక్ష్యము పాశ్చాత్యమతులు

చేసెడి పద్ధతి వేఱు. మనవాళ్ళు చేసెడిది వేఱు. అనగా పాశ్చాత్య మతులు శబ్దములు వాని ప్రయోగము పౌర్వాపర్యము మొదలైన వానిమీద సాధార పడుదురు. మన పండితులట్లు కాదు. ఆ కావ్యము నందు చెప్పబడిన ఖగోళ విషయములు మింట గ్రహముల సంచారము వలన ధాత్రియందు గలుగు గ్రహణములు భూకంపములు తుఫానులు మొదలైన వానిని లెక్కకట్టి చెప్పుదురు. సంవత్సరమునకు కొన్ని గ్రహణములు వచ్చును. ఈ గ్రహణము చంద్రగ్రహణమైనచో పూర్ణిమనాడు. సూర్య గ్రహణము పెఱతిథులందుకూడా వచ్చును ఆనాడు గ్రహణము వచ్చునని మన జ్యోతిష్కులు లెక్క కట్టుచున్నారు గదా! ఇది పాశ్చాత్యులకు నిన్న మొన్నటి వరకు అవిదితమైన విషయము కదా! లెక్క ముందునకు కట్టవచ్చు వెనుకకు కట్టవచ్చు. రామాయణ భారతములందు తిథులతో సహా తుపానులు చిన్న చిన్న ప్రళయములు ఉత్తర దక్షిణాయణ సంక్రమణముల కాలములు గ్రహముల సంయోగము గ్రహణములు నిరూపింపబడి యున్నవి. వాల్మీకి రామాయణమున యుద్ధకాండములో రామరావణులు యుద్ధము చేయుచున్నప్పుడొకప్పుడు రావణుని చేయి పై చేయియయ్యెను.

అప్పుడు రాముడమ్ముల పొదిలో నుండి బాణమును తీసికొనలేక పోయెను. అప్పుడు వాల్మీకులవారు గ్రహముల స్థితిని చెప్పినారు. ఆ స్థితి కోసలదేశముల కరిష్ఠదాయకములని యన్నారు. ఆ గ్రహములట్లుండుట కోసల దేశమునకే ఎందు కరిష్ఠ దాయకమో దేశకాల గ్రహముల యొక్క సార్వత్రికమైన విజ్ఞానము కలవారు చేయవలెను. అట్లుచేసినవారన్నారు. వారు దురదృష్టవశాత్తు ప్రమాణము కారు. వారు డాక్టరులు కారు. కనీసము SSLC అయినా తప్పలేదు.

ఆ జ్యోతిష్కుడు తానట్టి లెక్కలు కట్టినవాడు. రామాయణములో చెప్పబడిన లంకలో సంఘటిల్లిన యొక ఝంఝామారుతము కలుగవలయుననగా ఇన్ని లక్షల సంవత్సరములకు పూర్వమే యది జరుగవలయునని లెక్కకట్టి చూపించినారు. శ్రీ శర్మగారు "రామాయణమున ఇంద్రపారమ్యము" అన్న యధ్యాయము చివర "బ్రహ్మాపి నరం న రంజయతి" అన్నారు. అచ్చట నట్లు వ్రాయుట వారు చేసిన పరిశోధనము నందలి వారి విశ్వాసము. కాని యీ జ్యోతిర్గణితము నమ్మని వారిని గురించి మాత్రము ఈ మాట నిస్సంశయముగా చెప్పవచ్చును.

మొత్తము మీద నొక్కటిని నిస్సంశయముగా చెప్పవచ్చును వీరి పాండిత్యము చాల లోతుగలది. వీరి శ్రీ విద్యా రహస్య వేత్తృత సర్వంకష్టమని చెప్పుట కభ్యంతరముండకూడదు. భారత రామాయణములను కలిపి వీరు చదివినట్లు చదివిన సంఖ్య లేదనియే చెప్పవలెను. మహామేధావులైన వారితో నిండియుండిన యీ ప్రపంచములో తేరనుటకు వీలు లేదుగాని యున్నచో భారతదేశమున నొకరిద్దరుందు రేమో!

శ్రీ శర్మగారు గొప్ప గ్రంథమును వ్రాసిరి. మొదటి భాగ మధికారులకు గూడ నుపయోగించు నది. చివరి భాగము మందాధికారులకుపయోగించు నది.

శ్రీ శర్మగారికి నాకు నేడెనిమిదేండ్ల నుండి చెలిమి గలదు. వారింత లోతైన మనిషియని నేనను కొనలేదు. అప్పుడప్పుడు నైషధము నుండి కొన్ని శ్లోకములు దేవీ పరముగా వారు సమన్వయించి నప్పుడు నేను వారి కవి యాదృచ్ఛికముగా తోచిన విషయములను కొన్నాను గాని శ్రీ విద్యా విష యము నింతలోతుగా తెలిసిన వారనుకొనలేదు

వారి గ్రంథము వ్రాసినందుకు తెలుగువారే కాదు, భారతీయు లందరును కృతజ్ఞులుగా నుండ వలసిన విషయము.

## ఎమెస్కో "శృంగార నైషధము" పీఠికనుంచి

శ్రీ విశ్వనాథ (1970)

శ్రీ హర్షుడు మహాకవి.....నలదమయంతుల విరహమును వర్ణించినాడు. అదియొక యద్భుతము, అందులో నుపనిషత్తులలోని రహస్యములు పెట్టి నాడు. కొన్ని శ్రీనాథుడు వదలిపెట్టినాడు. సంస్కృతములో నున్న అటువంటి యొండు రెండు శ్లోకములకు వ్యాఖ్యానము సరిగా నర్థము వ్రాయ లేదు.

గుంటూరు శేషేంద్రశర్మగారని యొక గొప్ప తెలుగు కవి యున్నాడు. ఆయన యీ సంస్కృత హర్షనైషధముమీద కొన్ని వ్యాసములు వ్రాసి నాడు. ఈ హంసను గూర్చి వ్రాసినాడు. ఆ పుస్త కము పేరు స్వర్ణహంస. ఆ హంస యెవరు ? పరమ

శివుడా? సాక్షాత్ పరమేశ్వరియా? శ్రీ విద్యాధి
దేవతయైన శ్రీదేవియా? ఈ సంగతి యాయన
కొంత చర్చించినాడు.''